# ఆంధ్రమహిళ





ఆంధ్ర మహిళా సభ, హైదరాబాద్.

శంకుస్థాప నోత్సవ సంచిక

22 అక్టోబరు 1961.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఎడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ. ఎస్. ఎల్. సి., పరీక్షలకు శిక్షణ.

పారిశ్రామిక విద్యాలయము : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము.

మహిళా మందిరము : విద్యార్థినులకు వసతి గృహము.

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

నర్సింగ్‌హోమ్ : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త సర్వ్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది.

ఆర్థోపీడిక్ సెంటర్ : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం.

ముద్రణాలయము : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్క్సు చేయబడును.

నాగేశ్వర శిశువిహార్ : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది.

అర్బన్ వెల్ఫేరుప్రాజెక్టు : కపాలి తోట్టంలోను నారాయణస్వామి గార్డెన్‌లోను బీదలకు సంక్షేమ కార్యక్రమముల నిర్వహింపబడుతోంది.

వనితా బాలవిహార్ : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం

రీజియనల్ హాండీక్రాఫ్ట్సు యిన్స్టిట్యూట్ : ఆంధ్రమహిళాసభ, హైదరాబాదుబ్రాంచిచే నడుపబడుచున్న, చేతిపనుల శిక్షణాలయము.



హైదరాబాదులో ఆంధ్రమహిళా సభ సుస్థిర నివాసం
ఏర్పరచుకోవడానికి సాధన సంపత్తి చేకూర్చిన ఆంధ్ర
ప్రభుత్వమునకు, మన ప్రధానామాత్యుడు
శ్రీ సంజీవయ్యకు యీ ఆంధ్ర మహిళ సంచిక అంకితం.

ఆంధ్ర మహిళా సభ,
మదరాసు, హైదరాబాదు.

# ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

## రీజియనల్ హేండీక్రాఫ్ట్స్ యిన్స్టిట్యూట్‌లో

## వివిధ హస్తకళలలో తర్ఫీదుపొందిన విద్యార్థినులు

| | 1958_59 | 1959_1960 | 1960_1961 | మొత్తము |
|---|---|---|---|---|
| పేము, వెదురుపని | 11 | 10 | 9 | 30 |
| కార్డ్‌బోర్డు, బైండింగు | 9 | 9 | 9 | 27 |
| డైయింగు, అద్దకము | ... | 8 | 10 | 18 |
| ఫాన్సీ లెదర్ వర్కు | 10 | 10 | 8 | 28 |
| బొమ్మల తయారీ | 12 | 10 | 13 | 35 |
| | 42 | 47 | 49 | 138 |

### వివిధ రాష్ట్రములనుండి వచ్చి తర్ఫీదుపొందిన వారు

| | |
|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 50 |
| మద్రాసు | 29 |
| మైసూరు | 24 |
| కేరళ | 33 |
| పుదుచ్చేరి | 2 |
| | 138 |



### నేతపని (1960-61)

నెలకొల్పబడిన మగ్గములు : 15

తర్ఫీదుపొందుతున్న విద్యార్థినులు: 30

వయోజనలకు సంక్షిప్త విద్యాప్రణాళిక

1959_61 25 విద్యార్థినులు (యి. యస్. యల్. సి.)

1961_63 24 విద్యార్థినులు (హెచ్. యస్. యల్. సి.)



చెరియొక నూరు రూపాయలు విరాళమిచ్చి పదముగ్గురు సోదరీమణులు యింతవరకు హైదరాబాదు ఆంధ్ర మహిళా సభలో యావజ్జీవ సభ్యులుగా యెన్నికైనారు.

| | |
|---|---|
| వి. శ్యామలాదేవి. | సుచిత. జి. ఏ కే. |
| జి. తిమ్మాబాయి. | పి. సుజాతమ్మ జసిరెడ్డి. |
| కె. చంద్రకాంతమ్మ | కె. అమ్మాజీ. |
| యస్. కాంతమ్మ | తాయబున్నీసా బేగం |
| వి. సుభద్ర | యస్. హేమలత |
| యస్. హేమలత. | పి. ప్రసన్నకుమారి. |

డాక్టర్ సి. యస్. జానకి

యీ సోదరీమణులకు మా కృతజ్ఞత



ఆంధ్ర మహిళా సభ రజతోత్సవం

మే నెల 1962

# శుభాకాంక్షలు



ఆంధ్రమహిళాసభ చిరకాలంనుంచి, స్త్రీ జనానికి ఎక్కువ శ్రద్ధతో పాటుపడుతున్నది. హైదరాబాదులో గూడా సభకు స్వంత భవనం త్వరలోనే ప్రాప్తించ బోతున్నదని ఎంతో సంతోషం పొందుతున్నాను. సంక్షేమ కార్యక్రమంలో యీ సభయొక్క ప్రయత్నాలు జయప్రదం కావాలని ఆశిస్తున్నాను.

—డి. సంజీవయ్య.



శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్‌గారి నిరంతర పరిశ్రమచే మదరాసులోని "ఆంధ్ర మహిళా సభ" సంస్థ క్రమంగా అభివృద్ధిని పొంది, నారీలోకానికి అమూల్యమయినసేవ చేస్తున్నది. ఇటీవల కొలదికాలం క్రిందనే స్థాపింపబడినప్పటికీ, హైదరాబాదులోని 'ఆంధ్రమహిళా సభ' గూడ అనేక రంగాలలో పెక్కు కార్య కలాపాలను నిర్వహిస్తోంది.

ఈ సభకు నా ఆశీర్వచనములు.

—మాడపాటి హనుమంతరావు.

విద్య, సంఘ సంక్షేమం స్వతంత్ర రాజ్యాంగములో అత్యంత ప్రధానమైన కార్యక్రమాలు. మదరాసులోను, హైదరాబాదు లోను, యీ కార్యక్రమాలను ఆంధ్ర మహిళాసభ జయప్రదంగా నిర్వహిస్తూవుంది. అందుచేతనే ఆంధ్ర మహిళాసభకు సంపూర్ణ సహకారం లభిస్తూవుంది. ఈ సంస్థకు నా అభినందనములు.

—భీమసేన్ సచార్.

## "ఆంధ్ర మహిళాసభ" హైదరాబాదు.

| | |
|---|---|
| 9-1-1958 | హైదరాబాదులో ఆంధ్ర మహిళా సభ నిర్మాణము. |
| 15-6-1958 | విద్యార్థినుల వసతిగృహ ప్రారంభోత్సవము. |
| 9-7-1958 | రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారిచే హాండీ-క్రాఫ్ట్సుయిన్స్టిట్యూట్ ప్రారంభోత్సవము. |
| 9-2-1959 | శ్రీనగేష్‌గారి సతీమణిచే సంక్షిప్త ప్రబోధన పాఠ్య ప్రణాళిక ప్రారంభోత్సవము. |
| 24-6-1960 | చేతిమగ్గాలనేత, బట్టలఉత్పత్తి కేంద్రమునకు శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ గారిచే ప్రారంభోత్సవం. |
| 24-2-1961 | బీడీ పనివారి వాడలలో సంక్షేమ ప్రణాళిక ప్రారంభోత్సవం. |
| 22-10-'61 | ఆంధ్ర పితామహ హనుమంతరావుగారి అధ్యక్షతను ఆంధ్ర ప్రధానామాత్యుడు సంజీవయ్యగారి చేతను, శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారి చేతను ఆంధ్ర మహిళా భవనములకు శంకుస్థాపన. |



Women need to develop freedom
to think independently.

—**Message of Srimathi Kamala Devi Chattopadhyaya when she laid the Foundation Stone for Andhra Mahila Sabha Buildings in Madras on the 2nd September 1945.**

సెప్టెంబరు 2, 1945 నాడు మదరాసులో ఆంధ్ర మహిళాసభకు కమలాదేవి చటోపాధ్యాయ అధ్వర్యమున శంకుస్థాపనోత్సవం జరిగింది. ఆ సమయంలో మా వ్యవస్థాపకురాలి మాటలివి :

“మీ ఆశీస్సులు, అనగా అండగా వుంటే, మా కార్యకలాపాన్ని ద్విగుణీకృతోత్సాహంతో సాగించి, మీరు ప్రకటించిన సద్భావములకు కార్యరూపేణా కృతజ్ఞత సూచించుకుంటాం. ఈ మహోత్సవవేళ సేవాంజలి అర్పించడం కంటే ఇంకేమీయూ చెప్పలేను. మనసు నిండుగా ఉన్నందువల్ల మాటలు వెనుకబడుతున్నాయి. నమస్తే”

దుర్గాబాయి

(‘ఆంధ్ర మహిళ’ 1945 సం. సెప్టెంబరు సంచికనుండి)

---



ఇరవైయైదు సంవత్సరాల ఉజ్వల చరిత్రగల సంస్థను గురించి సూక్ష్మంగా చెప్పడం సులభం. ఎందుకంటే, ముత్యాలదండలో దారంలా ఆసంస్థ వివిధ కార్యక్రమాల నడుమ కానవచ్చే భావం ఒకటే ఉంటుంది. మహిళాసభతో సన్నిహిత పరిచయం ఉన్నవారికి గోచరించేది నిర్వాహకులలోని పట్టుదలతోకూడిన సేవాతత్పరత. ఇందువల్లనే పరిమళ భరితమైన పువ్వులతో నింపిన లతలా, సువాసనలు వెదజల్లుతూ బహుముఖాలుగా విస్తరించి అల్లిబిల్లిగా అల్లుకు పోయింది మద్రాసులోని ఆంధ్ర మహిళాసభ.

హైదరాబాదులోని లతను జాగ్రత్తగా మూడేళ్లు కుండీలో పెంచి నేలలో నాటుతున్నారు నేడు. త్వరలోనే వేళ్లు తన్నుకుపోయి ఆకాశమంత పందిరిని అల్లుకు పోగలదనడంలో ఎవరికీ ఎలాటి సందేహము లేదు. ఈ వనమహోత్సవాన్ని జరిపించే తోటమాలురందరకూ అభినందనాలు, కృతజ్ఞతలు చెప్పుకొంటుంది, ఆంధ్రప్రజ. తమ రాష్ట్రంలో కలకాలం నిలిచే ఒక మహాసంస్థ, రూపొందుతోందన్న సంతోషంతో గర్వంతో.

దుర్గ శారదాదేవి.

ఆంధ్ర మహిళాసభ, హైదరాబాద్, ఇంత త్వరితంగా స్వంత భవనాలను నిర్మించుకో గలుగుతున్నదంటే, ప్రజలు ప్రభుత్వము, చూపుతున్న ఆదరాభిమానాలను వ్యక్త పరుస్తున్నది. ఇందుకు కృతజ్ఞులం. ఈ పైనకూడా సభ ఇతోధికంగా ప్రజాబాహుళ్యానికి సేవచెయ్యటానికి కావలసిన శక్తి సామర్థ్యాలను భగవంతుడు ప్రసాదించుగాక!

కె. సుగుణమణి

లీలా గౌరిబాజి.

కార్యదర్శినులు.



ఆంధ్ర మహిళాసభ చరిత్ర ఒక అద్భుతమైన కథా నిక, పుట్టిన నాటినుండి యీనాటివరకు, అది మహోజ్వల మైన శక్తిసంపదలతో రాణించినది. ఆంధ్ర మహిళలకు కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టినది.

చెన్నపురి ఆంధ్రమహాసభనుండి విడివడ్డది. ప్రత్యేక సంస్థగా రూపొందినది. బృందావన వీధిలో, ద్వారకా పురములో, అద్దె యిళ్లలో తలదాచుకొని, అటుపెరిగి, యిటుపెరిగి మైలాపూరు అడయారులలో విస్తరించినది. విద్యాలయాలు, వసతిగృహాలు, శిక్షణకేంద్రాలు, పారిశ్రామిక కేంద్రాలు— ఎన్నో, ఎన్నెన్నో వానిలోనుండి ఉద్భవించినవి. వికసించినవి. ఇప్పటికది ఆంధ్ర మహిళలకే పరిమితముకాదు. దాని రెక్కలక్రింద, రక్షణక్రింద, భాషాప్రాంతీయ విభేదములు లేకుండా, మహిళలు ఉపయోగమును పొందుతున్నారు. ఆంధ్రప్రదేశ్ అవతరణలో ఆంధ్ర మహిళాసభ, ఆంధ్రరాజధానీ నగరంలోకూడా అవతరించినది. చిలవలు పలువలుగా పెరుగు చున్నది.

ఆంధ్ర మహిళాసభ, ఆంధ్ర మహిళల ప్రతిబింబము. ఆంధ్ర మహిళలశక్తి దాని ప్రతి రక్తనాడులలోనూ ప్రవహిస్తున్నది. వారి సామర్థ్యము, దాని కార్యకలాపాలలో ప్రతిబింబిస్తున్నది. వారి కార్యదీక్ష, బహుళములైన దాని శాఖలలో ప్రస్ఫుటమవుతున్నది. వారి కరుణాశీలత, దాని సేవాకార్యక్రమాలలో స్పందిస్తున్నది. వారి ఔదార్యము, భాషాప్రాంతీయ వ్యత్యాసములలోని దాని సేవా తత్పరతలో ద్యోతక మవుతున్నది.

ఆంధ్ర మహిళల ధీరత్వము రూపొందంగా, మహిళాసభ సూత్రధారిణి శ్రీమతి దుర్గాబాయి అయినది. విస్తరిస్తున్న ఆంధ్ర మహిళాసభ, వికసిస్తున్న ఆంధ్ర మహిళా లోకపు ప్రతిబింబము.

—ఆవుల జయప్రదా దేవి.



ఆంధ్ర మహిళాసభా,

దిగ్విజయీభవ !

—ఆర్. వి. రావు.



మా

హ

ఝ

ది

హ

చ

ర్య





నిర్దుష్టమైన ప్రజాసంస్థ ఆంధ్రమహిళాసభ చేతుల్లో జరుగుతున్న ఈ హేండీక్రాఫ్ట్స్ యిన్స్టిట్యూట్‌కు ఉజ్జ్వలమైన భవిష్యత్తువుంది.

—రాజాధ్యక్ష.







పదహారు సంవత్సరాల నుండి నిరంతరాయంగా మదరాసు నుండి ప్రచురింపబడుతున్న 'ఆంధ్రమహిళ' యికనుండి ఆంధ్రరాజధాని హైదరాబాదులోనే ఉదయిస్తుంది. దీనికి తగు యేర్పాట్లు చేస్తున్నాం. చందాదారులుగా చేరడానికి ఆంధ్ర మహిళలందరూ త్వరపడండి.

బ్రహ్మాండమైన శాఖలుగా వ్యాపించి, ఊడలు దింపుకుని, దట్టమైన తన ఆకుల చిక్కని నీడక్రింద అసంఖ్యాకులయిన వారికి ఆశ్రయమిచ్చే మర్రిచెట్టు—ఇదే జ్ఞాపకం వస్తుంది మహిళాసభను చూస్తే.

★

# ఆంధ్ర మహిళాసభ

★

## హైదరాబాదు

★

మద్రాసులో ప్రారంభింపబడి, తన వివిధ కార్యకలాపాలు దినదినాభివృద్ధి చేసుకుని, ఒక మహాసంస్థగా పేరెన్నికగన్న మహిళాసభయొక్క శాఖ హైదరాబాదులోకూడా ఏర్పడింది.

★

ఈశాఖ బరకత్‌పురలోని మూడు భవంతులలో తన కార్యక్రమాలను నడుపుతోంది. ప్రాంతీయ చేతిపనుల శిక్షణాలయం నిర్వహణ, చేనేతశాఖ, సంక్షిప్త విద్యా ప్రణాళిక, పట్టణంలో ఒక మారుమూల ప్రాంతంలో పట్టణ సంక్షేమ ప్రణాళిక, మహిళామండలి కార్యక్రమాలు—ఇవి ప్రధానాంగాలు సభకి.

ప్రాంతీయ చేతిపనులు శిక్షణాలయం; అఖిలభారత చేతిపనుల మండలి సహాకారముతో కేంద్ర సాంఘిక సంక్షేమ సమితి ఏర్పరచిన శిక్షణ కార్యక్రమంక్రింద, యీశిక్షణాలయం నెలకొల్పబడినది. ఇందులో ఈసంవత్సరము 40 మంది యువతులు దక్షిణదేశంలోని నాలుగు రాష్ట్రాలకు చెందినవారు శిక్షణ పొందుచున్నారు. గత రెండు సంవత్సరములలో 50 మంది చొప్పున శిక్షణ పొందారు. ఈశిక్షణాలయం ఖర్చు యావత్తూ చేతిపనుల మండలి భరిస్తుంది. యువతులకు భోజన, వసతిక్రింద రు. 55-- స్టయిపెండుగా ఇవ్వబడుతుంది.

ప్రస్తుతం నేర్పబడుతున్న చేతిపనులు—బొమ్మల తయారీ, కొయ్యపని, తోలుపని, ఏనుపని, వెదురుపని, బైండింగు, అట్టపని, శిక్షణ పొంది వెళ్లినవారు, యిప్పుడు పొందుతున్నవారు తయారుచేసిన వస్తువులు చక్కగా అమర్చి ఒక 'షోరూం' ఏర్పాటు చేశారు. అందరూ తప్పక చూడదగ్గది అది.



★

వివరణ :

తురగా

జానకీరాణి

★

ఆంధ్ర సంక్షేమ మండలివారి "సుభాషిణి" నుండి.

# ఆంధ్ర మహిళా సభ



కొయ్యబొమ్మలకు రంగులు వేస్తున్న బాలికలు

నోరు వూరించే సీతాఫలాలు, మామిడిపండ్లు — అన్నిటి కంటే మించి రంగు కాగితాల్లో పిప్పర మెంట్లు, నవనవలాడే పొట్లకాయ — గోడ మీద ప్రాకి, పచ్చని గుత్తుల ద్రాక్షపళ్లతో నిండిన ద్రాక్షతీగె— ఇదంతా ఒక విశ్వామిత్ర సృష్టి.

లేసు పనికూడా చాలా బాగున్నది. బట్టలు, కుర్చీలు, కొయ్యకుర్చీకి తగిలించే సీట్లు మొదలైనవి వున్నాయి.

వెదురుగానే ఎదురుగా మనకి కనుపించేవి అవు దూడ. కర్షకుడు—నల్లని ఆమట్టిబొమ్మలో ఆమనిషిచేసే పరిశ్రమ కనిపిస్తుంది. అక్కడే గోడలమీద తగుల్చుకునే వెదురుబద్దలమీద బిగించిన కొయ్య బొమ్మలున్నాయి. ప్రక్కగదిలో ఎదురుగా—గంగిరెద్దు మేళం. జీవకళ ఉట్టిపడే ఆ ఎద్దు, పచ్చనిబట్టల నన్నాయి మేళగాడు— వాళ్లు మనదగ్గరికి వస్తున్నారనిపిస్తుంది.

ఇవి కాక గుడ్డబొమ్మలు—చక్కని బుల్లి బుల్లి ఉడుపులు, నగలు, వాళ్లచేతుల్లో వస్తువులు—అన్నీ చూస్తుంటే మనము ఇంకేదో దేశంలో, సౌందర్యవంతమైన వస్తువులమధ్య వున్నామనిపిస్తుంది. కథాకళీ నర్తకుడు, అతని ప్రక్క మణిపురి నర్తకి, మరో ప్రక్క భరతనాట్య రంగములో 'రంగుని' అడుగు వేయనున్నట్లు యిద్దరు యువతులు; బర్మా యువతి, బలమైన కళికాలు వంచి వ్యవసాయపుపని చేస్తున్న కర్షక స్త్రీలు; బుర్రకథదళం— ఒకటేమిటి— జీవితమే వివిధ దృశ్యాలలో, వివిధ కోణాలలో ప్రదర్శింపబడుతుంది అక్కడ. చిన్నపాపాయి ఎత్తిన ఒక అంబాడి కుంచని, తండిసాలతో, ఎర్రని చక్కని దుస్తులతో —ఎంత వయ్యారమో!

ఇక కొయ్యబొమ్మలు—చిన్ననికాళ్ల బొద్దింకలు, వళ్లు గగుర్పొడుస్తుంది. పడగ ఎత్తిన ఒక పాము, దాన్ని పట్టబోయే ముంగిస, వళ్లు జలదరిస్తుంది. గోడమీద ప్రాకే బల్లులు కూడా సహజంగా వున్నాయి.

తోలుపని—చేతిసంచులు, ఫోటో ప్రేములు, చక్కని బంగారు అంచులతో చూడ ముచ్చటగా వున్నాయి. మంచి పనితనం కనుపిస్తుంది.

వెదురుతో రకరకాల వస్తువులు, ఇంకుస్టాండు లాంటి ఉపయోగకరమైన వస్తువులు తయారుచేశారు. బైండింగు పనికూడా నేర్చుకుంటున్నారు.

ఇలా శిక్షణ పొందేవారుకాక, సరదాకి నేర్చుకునే వారు 10 మంది స్త్రీలు, వారానికి మూడురోజులు తోలు, వెదురు బొమ్మలతయారీపనులు తరగతులకు హాజరవుతుంటారు.

చేనేత విభాగము: ఇది ఒక ఉత్పత్తి శిక్షణాలయము. ప్రస్తుతము 20 మంది స్త్రీలకు నెలకు రు. 25-ల స్టయిపెండు యివ్వబడుతోంది. ఇప్పుడు 15 మగ్గాల మీద పని నడుస్తోంది. దీనిఖర్చు యావత్తు కేంద్రసాంఘిక సంక్షేమసమితి భరిస్తోంది. చీరెలు, పాంటుబట్టలు, దుప్పట్లు, తువ్వాళ్ళు—మొదలైనవి నేస్తున్నారు. వీటికి మంచి గిరాకీకూడా వున్నది. ఇప్పటివరకు సుమారు 60 వేల రూపాయలు ఖరీదు చేసే బట్టలు నేయబడినవి.

బట్టలకు రంగులు వేయడం, అద్దకం పనులుకూడా బాగా జరుగుతున్నాయి. ఇక్కడ "అద్దిన చీరెలు,

దుప్పట్లు, టేబిలుక్లాతులు మొదలైనవి నాణ్యంలో బజారులో అమ్మే సరుకులకి తీసిపోని సరికదా, బహు చవగ్గాకూడా వున్నాయి.

సంక్షిప్త విద్యా ప్రణాళిక: కేంద్ర సంక్షేమ సమితి సహాయంతో 1959—61 సంవత్సరములో 38 మందిని ఇ. ఎస్. ఎల్. సి. పరీక్షకు పంపగా, 33 గురు ఉత్తీర్ణులైనారు. మొదటిబట్టు ఫలితాలు ఘనంగా ఉండడంవలన రెండోబట్టుకూడా మొదలై 1963 వరకు నడుస్తుంది. ఈసారి మెట్రికు పరీక్షకు 25 మందికి శిక్షణ యిస్తున్నారు.

హాస్టలు: సంక్షిప్త విద్యాప్రణాళిక విద్యార్థినులు, చేతిపనుల శిక్షణాలయం విద్యార్థినుల వసతికోసం ఒక పెద్ద భవంతిలో హాస్టలు నడుస్తోంది. ఇక్కడ యువతులంతా చేరి, ఒక కుటుంబంలో సభ్యులకుమల్లే మెలుగుతుంటారు.

పట్టణ సంక్షేమ ప్రణాళిక: మార్చిలో కేంద్రసమితి గ్రాంటుతో ప్రారంభింపబడినది. నగరములో సుల్తాను బజారు అన్న ప్రదేశంలో సాద్రి, చేతిపనుల పనివారుండే ఒక గదిలో సంక్షేమ కార్యక్రమాలను నిర్వహిస్తోంది.

ఇద్దరు మహిళా కార్యకర్తలు, ఒక అటెండరు వున్నారు. మహిళాసభ సహాయ కార్యదర్శులు పర్యవేక్షణ జరుపుతుంటారు.

ఉదయంవేళ ప్రీస్కూల్ తరగతికి ఐదారుసంవత్సరాల లోపు వయస్సుండే పిల్లలు హాజరవుతారు. పరిశుభ్రత, అక్షరాలు, చిన్నచిన్న కథలు, పాటలు వాళ్ళకు నేర్పిస్తారు. ఉర్దూ తెలుగు పిల్లలకి ఆయాభాషల్లో నేర్పుతారు. ప్రస్తుతం 12 మంది మాత్రమే పిల్లలు వస్తున్నారు. దుస్తులతయారీ, చేతికుట్టు, మిషనుకుట్టు, ఊలుఅల్లికం కత్తిరింపులు మొదలైనవి నేర్చుకోడానికి 30 మందివరకు స్త్రీలు వస్తున్నారు. ఈ తరగతి మధ్యాహ్నంవేళ జరుగుతోంది. 12 మంది స్త్రీలకి పేను, వెనరు పనికూడా నేర్పబడుతోంది.

పిల్లలకి సాయంత్రాలలో ఆటలు వుంటాయి. ఆట పరికరాలు చాలా వున్నాయి. ఇటీవల 'కబాడీ' కూడా ఆడుకొంటున్నారు.

రాత్రివేళ జరిగే వయోజన పాఠశాలకి 10 మంది హాజరవుతున్నారు. వారికి తెలుగే నేర్పబడుతోంది.

ప్రస్తుతం సంక్షేమ కేంద్రం యొక్క ఆవశ్యకత, ఉపయోగాలని గురించి అక్కడి ప్రజలకి నచ్చచెప్పి, వారిలో యీ విషయం నాటుకునేటట్లు చేయవలసిన అవసరం వుంది. అందువల్ల మహిళా కార్యకర్తలు ఇంటింటికీ వెళ్ళి, అక్కడివారితో కలిసి మెలిసి మాట్లాడి, పరిచయాలు పెంపొందించుకొంటున్నారు.

ఇటువంటి పథకాలన్నీ నిర్వహించడం కాక, మహిళాసభ సభ్యురాండ్రు (300 మంది) తదితర కార్యక్రమాలలో పాల్గొంటుంటారు. పండుగలు, పూజలు, ఉత్సవాలు, జాతీయ దినోత్సవాలు, అన్ని వైభవంగా, అత్యాసక్తితో జరుపుకుంటారు. సభలు, సమావేశాలు జరుపబడుతుంటాయి. గ్రంథాలయ, పఠనాలయాలకి స్త్రీలు వస్తుంటారు.

మహిళాసభ దినదినాభివృద్ధిగాంచి, మరెంతోమంది స్త్రీలకు ఆధారముగా నిలచి, మరింతమంది స్త్రీలను తన కార్యకలాపాలవలన ఆకర్షించగలదని ఆశించవచ్చును.

59—'61 ప్రణాళిక విద్యార్థినులు.



# ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

---

## కార్యనిర్వాహక వర్గము

| | | |
|---|---|---|
| వ్యవస్థాపకురాలు | : | శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్. |
| సభ్యురాండ్రు | : | శ్రీమతి ఎ. శ్యామలాదేవి. |
| | : | శ్రీమతి చంద్రమతీదేవి. |
| | : | శ్రీమతి ఎ. లలిత. |
| సంయుక్త కార్యదర్శినులు | : | శ్రీమతి కె. సుగుణమణి. |
| | : | శ్రీమతి లీలాగౌరీబాజి |

## సభచే నిర్వహింప బడుతున్న రీజియనల్ హాండీక్రాఫ్ట్ యిన్స్టిట్యూట్ యొక్క పాలకవర్గములోని సభ్యులు

శ్రీమతి రాణీ కుముదినీదేవి

శ్రీ పి. యల్. సేతి; డిప్టీడైరెక్టరు (టెక్నాలజీ), అఖిలభారత కుటీరపరిశ్రమల సంఘము.

శ్రీ హెచ్. యఫ్. బి. పెయిన్, కార్యదర్శి; కేంద్ర సంక్షేమ సంస్థ.

శ్రీ ఆర్. జి. రాజాధ్యక్ష, ప్రిన్సిపాల్, కుటీరపరిశ్రమాభ్యాస కళాశాల, బొంబాయి.

శ్రీ డాక్టరు. ఆర్. వి. రావు. జాయింట్ డైరెక్టరు, పరిశ్రమవాణిజ్యశాఖలు, ఆంధ్రప్రదేశ్.

శ్రీ జి. జి. ఎయిరే, సూపరింటెండెంటు, రీజియనల్ హాండీక్రాఫ్ట్‌యిన్స్టిట్యూట్ హైదరాబాదు.

శ్రీమతి బి. తిమ్మాబాయి.

# KALA



మా విద్యార్థినుల వ్రాతపత్రిక కళ నుండి కొన్నిముత్యాలు తరువాయి పేజీలలో.

# పురాతనమైన పేము, వెదురు, పరిశ్రమ

## .... కేన్ సెక్షన్‌లో తర్బీతు పొందుతున్న విద్యార్థిని . . .

మానవుడుద్భవించినది మొదలు ఈ పరిశ్రమ కూడ యుద్భవించి, దినదిన ప్రవర్ధమాన మగు చుండెను. మానవునకు కావలసిన ముఖ్యావసరములు మూడు. అవి తినుటకుతిండి; కట్టుటకుబట్ట; నివసించుటకు వసతి కావలసియుండెను.

ప్రథమమున మానవుడు చాల అనాగరికుడై పత్రములతోను, జంతుచర్మములతోను మానమును కాపాడు కొనెడువాడు. రానురాను క్రమముగా వస్త్రధారణను మొదలుపెట్టెను. అదేవిధముగ ఆహారసేకరణను చేయుచుండెడివాడు. ఆహారమును నిలువచేసుకొనుటకు తగిన సామగ్రి కావలసియుండెను. కావున ప్రథమమున మట్టితోగాని, లోహముతోగాని పాత్రలను తయారు చేయు నాగరికతను కలిగియుండక పోవుటచే, అడవిలో దొరుకు వెధురు పేములతో, బుట్టలు మొదలగువానిని తయారుచేసెను.

మొదట పక్షులు కట్టిన గూటినిచూచి, పక్షి గూటిని అల్లిన విధముగ బుట్టలు మొదలగు వానిని అల్లుట కభ్యసించెను. నాగరికత యభివృద్ధి యగుచున్నకొలది ఈ యల్లిక వివిధరకములుగ అభివృది యగుచుండెను. నేటికిని చాల అభివృద్ధిలో నుండెను.

ఈ పరిశ్రమ చాల పురాతనమైన పరిశ్రమ. ద్వాపర యుగములో, మన పూజనీయుడైన కృష్ణుడు జన్మించి నపుడు, తండ్రియైన వసుదేవుడు కృష్ణు నొకగంపలో పెట్టి వ్రేపల్లెకు జేర్చిన విషయము అందరికి విదితమే. ఇందు మూలముగా ఆ యుగములో గూడ ఈపేము, వెదురు పరిశ్రమ అభివృద్ధిలో నుండెనని విశదమగు చుండుటయేగాక, ఈ పరిశ్రమ యుగయుగాలనుండి అమలులో నుండెనని విశదమై, పురాతనమైనదని తెలిసి కొనుట కవకాశములు లభించెను.

ప్రథమమున వెదురుతో పాత్రలనుచేసి వానికి ఒక విధమగు మట్టిని దానిపై పూతపూసి వంట సహితము చేసు కొనెడివారని కొన్ని గ్రంథములవల్ల విశదమగుచున్నది.

వెదురుబొంగులను దూలములు; వాసములుగ నుపయోగించి ఇళ్ళను కట్టుకొనెడివారు. ఇప్పటికిని మన్యప్రదేశములలో చూచిన కోయజాతివారు వెదురుతో ఇళ్ళనుకట్టుకొని, కొలమానికలు, తడికలు, మంచములు సహితము వెదురుతోనే తయారు చేసుకొని ఉపయోగించుదురు.

దక్షిణ అమెరికాలో మొదట గుండ్రని వస్తువులను తయారు చేసెడివారు. బ్రిటనులు రక్షణకొరకు యుద్ధములో నుపయోగించు డాలు, కవచములను పేము, వెదురులతో కొబ్బరిపీచులతో గూడ తోలు కవరువేసి తయారు చేసుకొనెడివారు. పడవలనుగూడ వెదురుతో చేసి తోలును పైకప్పుగావేసి గుండ్రముగా చేసెడివారు. అది గుండ్రముగా నీటిపై గిరగిర తిరుగుచు తేలిపోవుచుండును. ఇప్పటికినీ పడవలు జలాశయ ప్రాంతములలో కాననగును.

ఈ పరిశ్రమ నాగరికతానుగుణ్యముగా, క్రమముగా నభివృద్ధి చెందుచుండెను. ఈ నవ నాగరికతా కాలములో సున్నితమైన, అందమైన, నాగరిక వస్తువులు మిక్కిలి ఉపయోగకరములుగ తయారు చేయుచుండిరి. పేము వెదురులతో పళ్ళెములు, పూలసజ్జలు, చెత్త వేయుటకు చెత్త బుట్టలు; సోఫాలు; కుర్చీలు మొదలగు వివిధరకములైన వస్తువులను తయారుచేయుచుండిరి.

ఈ పరిశ్రమ మంచిఅభివృద్ధిలోనికి రావలెనన్న, వివిధాకారములలో వివిధరకములుగ, వివిధోపకరణములై వస్తువులను నాజూకుగా, అందముగా తయారుచేయవలెను. ఈ విధముగా వస్తువులను తయారుచేయుట: ఆ పరిశ్రమాభివృద్ధికి తోడ్పడి, యింకను మిక్కిలి యభివృద్ధిలోనికి రావలెనన్న, దీనికి తోడ్పడు కళాకారుల మేధాశక్తిపై నాధార పడియుండును.

———

# మా వసతి గృహం

"పి. సరోజిని"

జూలై 1 తా॥ చేతిపనుల కేంద్రమునకురాగ చాల మంది విద్యార్థినులు వున్నారు. శ్రీమతి వెంకటేశ్వరరావుని కలుసుకొని 8 తా॥ వస్తానని చెప్పి ఆమె సెలవుమీద తిరిగి ఇంటికి వెళ్ళినాను. కాని ఇంటికివెళ్ళిన దగ్గరనుంచి నన్ను ఒకే ఒక సమస్య పట్టుకుంది. "వసతి గృహంలో చేరాలా, ఇంటినుండి రావాలా?" అని. మా అన్న ఇంటినుండి వెళ్ళు: దగ్గరేగా అన్నారు. కాని నాకు వసతి గృహంలో చేరాలని వుంది. నా వుద్దేశం అన్నకు చెప్పేను. సరే, నీ యిష్టమని ఒప్పుకొన్నారు.

జూలై 8 వ. తా. 4 గం॥ లిన్నగ ఆంధ్రమహిళా సభ వసతి గృహమునకు అన్నను తోడుగ తీసుకొని వచ్చేను. ఎవరూ లేరేమో ఇల్లు చాల నిశ్శబ్దముగవుంది. అంతలో ఎవరో 10 సం॥ వయసుగల అమ్మాయి వస్తూ వుండగ, శ్రీమతి వెంకటేశ్వరరావు ఇచ్చినచీటి యిచ్చి లోపలికి పంపగ, ఎవరో ఒకామె పసుపురంగు ఎర్రని అంచు చీర, ఎర్రనిరంగు జాకెట్ ధరించి, జుట్టును జడ వేయకుండా ముడిచుట్టుకొని బయటకు వచ్చి చాల మర్యాదగ మాట్లాడినారు. ఇలా అన్నతో మాట్లాడుతూ ఏదో మర్చిపోయి గుర్తుకు వచ్చినట్లు 'మీ చెల్లెలుకు తెలుగు తెలుసునా అండీ?, అనిఅడిగేరు. నాకు అప్పుడే భయం వేసింది. 'ఇదేమిరా భగవంతుడా! ఇక్కడ మళయాళం అరవం వున్నట్లే తెలుగు వచ్చా?' అని అడుగుతారని నా మనసులో అనుకొన్నాను. మా అన్న తెలుగుబాగ వచ్చుని చెప్పేరనుకోండి. ఇక అన్న వారిదగ్గిర సెలవు తీసుకొని నన్ను అప్పగించి 'కొంచెం మా చెల్లెను చూస్తూ వుండండి, క్రొత్తపోయే వరకు' అని చెప్పి వెళ్ళేరు.

అప్పుడే విద్యార్థినులు కేంద్రంనుండి కాబోలు ; వరుసగా ఒక్కొక్కరే వస్తున్నారు. కొంతమందిని చూస్తూ వుంటేనే నాకుభయంవేస్తుంది. ఎందుకంటేఇంతమందిని చూసేనుగాని, ఒక్కరూ తెలుగు మాట్లాడలేదు. అలాగే చూస్తువుండగ ఇప్పటివరకు నాతో వున్నవారు. "రా, కాఫీ తీసుకొందువు గాని" అని లోపలికి తీసుకొని వెళ్ళి వారే కాఫీ ఇచ్చేరు. నాకు కాఫీమీదనే లేదు. ధ్యాసంతా తెలుగువారు లేరా? వున్నారా? అని. ఇంత సేపు మాట్లాడిన వారు వార్డన్‌గారని తెలుసుకొన్నాను. నన్ను గమనించేరు కాబోలు. "ఎందుకు భయపడుతున్నట్లున్నావు? తెలుగు వాళ్ళు 4 గురు వున్నారు. అని చెప్పి వారిని పిలిచి పరిచయం చేసేరు. ఆ సాయంత్రం, ఆ రాత్రంతా వారిని విడువకుండా వాళ్ళతోనే వున్నాను. అసలు జరిగిన తమాషా ఏమిటంటే, నేను వార్డెన్‌గారితో మాట్లాడి లోపలికి రాగానే, మళయాళీలు చుట్టూచేరి 'ఏ ఊరు? మీ పేరేమిటి?' అని ప్రశ్నల వర్షం మళయాళంలో కురిపించేరు లెండి ; అందుకే అంతభయపడి పోయాను.

ఇలా వారం గడిచేసరికి కొంచెం కొంచెం అందరితో కలసి తిరగడం అలవాటయింది. తెలుగు, అరవం, మళయాళం, ఇంగ్లీషు, హిందీ, రకరకాల భాషలు మాట్లాడేవారు. మళయాళీలతోను అరవం వాళ్ళతోను, ఇంగ్లీషు మాట్లాడుతూ, అందరితో కలిసి మెలిసి వుండటం అలవాటయింది.



హాస్టల్ విద్యార్థినులు

# మా వసతి గృహం

ఉదయం 5. గం॥ లేవటం 6. గం॥ ఉదయ ప్రార్థన చేయటం, ప్రార్థన అయిన వెంటనే కాఫీతీసుకోవటం, కాఫీ త్రాగిన దగ్గరనుండి 9. గం॥ వరకు మనకు యిష్టము వచ్చినపని, అంటే, తరగతులపని మన స్వంతపని ఏమైనా సరే, ఇష్టము వచ్చిన పని చేసుకోవచ్చును. ఫలానాపనే చేయవలయునని నిబంధనలేదు. 9½ గం॥ భోజనము చేసి 10 గం॥ చేతిపనుల కేంద్రమునకు వెళ్ళి, తిరిగి 1-15. ని. వసతి గృహమునకువచ్చి ఫలహారము తీసుకొని, మరి 2. గం॥ కేంద్రమునకు వెళ్ళి, 5½ గం॥ వసతి గృహమునకు వచ్చి, కాఫీ తీసుకొని 6-15.వరకు ఆటలు ఆడి, 7.గం॥ సాయంకాలం ప్రార్థన చేసి, 8. గం॥ రాత్రి భోజనము చేసి, 8½ నుండి 10. గం॥ వరకు చదువో, లేక క్లాసులో పనో చేసుకోవచ్చును. ఇది మా వసతి గృహములో అనుదిన కార్యక్రమము.

ప్రతిరోజు మన ఇష్టమొచ్చిన ఆటలు ఆడుకోవచ్చును. సాయంత్రం 5-30 నుండి 6-30 ని. వరకు ఆటలు ఆడవచ్చును. ఆటల కొరకు మా సెక్రటరీలు అయిన శ్రీమతి సుగుణమణి, శ్రీమతి లీలాబాజి గార్లు క్యారమ్ బోర్డు, రింగ్ టెన్నిస్, త్రోబాల్, బేట్ మెంటన్ ఎన్నెన్నో రకరకాల ఆటలాడు సామాగ్రితెచ్చి ఇచ్చినారు. శ్రీమతి-సుగుణమణి గారు శ్రీమతి- లీలాబాజి గారు సాధ్యమైనంతవరకు ప్రతిరోజు వసతి గృహమునకు వచ్చి పిల్లలతోకలిసి ఆడుతూ వుండేవారు. శ్రీమతి- సుగుణమణిగారయితే ఆటలలో పోటీలు పెట్టి విద్యార్థినులలో ఒక విద్యార్థినిగా కలిసి ప్రతిరోజు ఆటలు ఆడించేవారు. మాకున్న ఉత్సాహము వారు ఆదేసరికి, రెండింతలు పెరిగి తప్పక వారితో పోటీచేసి ఆటలు ఆడుతాము. ఇంక ఇంతేనా? పండుగలు వచ్చినప్పుడు మా సెక్రటరీలు- శ్రీమతులు సుగుణమణి, లీలాబాజిగార్లు, మా వార్డన్‌గారు హడావిడి ఇంతింత కాదు: నిజంగా ఆ సుగుణమణి గారి ఓపిక, సహనము, ప్రేమ, వర్ణించలేను. పిల్లలతో కలసిమెలసి పిల్లలను ప్రోత్సహించి సంతోషపెట్టేవారు. మేము ఇంటిలో చేసుకొన్నట్లే పండుగలన్నీ చేసుకొంటాము. ఇక వార్డన్‌గారి సంగతి వేరుగ చెప్పాలా? 3గం॥కు అందరినిలేపి, పండుగకు అందరూ సంతోషముగ చక్కగా తయారుగ వుండమని చెప్పి, తల్లివలె అందరినీ చూసేవారు. పండుగ రోజున మా వసతి గృహము పెండ్లి ఇల్లే అంటే నమ్మండి! అంతే కాదు! ముఖ్యమైన పండుగలకు డ్రామాలు, ఆటలపోటీలు, పాటలు, ఒకటేమిటి? రకరకాలవి అన్నీ వుంటాయి. మేమే కాదండి; ఇవ్వన్నీ అనుభవించేది. మాస్టాప్‌ను, సూపరెంటెండెంటును, బయటివారిని ఆహ్వానించి అంతా కలిసిమెలసి సంతోషాన్ని అనుభవించే వారము. ఇవేనా! మా సుగుణమణిగారు, లీలాగారు, వార్డన్‌గారు కలసి మమ్ములనందరిని గండిపేటకు, హుసేన్‌సాగర్‌కు, కిద్వాయ్ కాలేజికి 'పిక్‌నిక్' నకు కూడ తీసుకొని వెళ్ళేరు. అక్కడ మేము గడపిన సంతోషము వర్ణించలేను! మాతో పాటే మాస్టాపు కూడ వచ్చేరు. తల్లివలె సుగుణమణిగారు. అక్క వలె లీలా బాజిగారు, వీరికి మించి వార్డన్ శ్రీమతి ఇందిరాబాయి చాల సంతోష పెట్టినారు.

ఈ విధంగా మా చేతిపనుల కేంద్రంలో తరిబీతు పొందే సంవత్సరము ఇట్టే గడచిపోయింది. మొదట అంతభయపడి ఎప్పుడు వెళ్ళిపోదామా అనిపించిన నాకు, ఇప్పుడు ఎలా ఇంతమందిని వదలి వెళ్ళాలా? అని ఒకే దిగులు. తల్లికంటే ప్రేమగ చూచిన సుగుణమణి గారిని, మా వార్డన్ ఇందిరాబాయిగారిని, అక్కవలె చూచిన లీలాబాజిగారిని విడిచి వెళ్ళలేకుండా వున్నాను. అంతేనా? మళయాళీలు, తమిళులు ఒకరేమిటి; మా వసతి గృహ విద్యార్థినులంతా అక్క చెల్లెంద్రవలె వున్నారు. వారిని ఏవిధంగా విడిచిపోవాలి?

చూసేరూ! ముఖ్యమైన విషయము అసలు జబ్బులు రాకుండా అధమము వచ్చిన వెంటనే పోయేలాగ చూచిన డాక్టరు- సృతగారు చెప్పుకోతగ్గ మనిషి. వారైతే డాక్టరు గారిలాగ కాకుండ, ఎవరైనా సరే, జబ్బుగా వుంటే రోజుకు 4-5 సార్లు చూడటమే కాకుండా, అర్ధరాత్రి అపరాత్రి అనే నియమము లేకుండా వచ్చేవారు. వారి దయకే మా జబ్బులు సగంపోయేవి.

ఇటువంటి వారినందరిని వదలి వెళ్ళాలంటే నాకు మనసు రావడములేదు, విడువలేక విడువలేక అందరికి నాకృతజ్ఞత తెలుపుతూ •కన్నీటితో నేను మా వసతి గృహం విడవవలసి వచ్చినది.

---

# చేడియల అందము చేతిపనులు

అల్లదే! ఆంధ్రుల భాగ్యనగరంబు,
అల్లదే! చూడుడు 'ఆంధ్ర మహిళసభ'
అల్లదే! కనుల కింపొనరించు పనితనంబు,
అల్లదే! సంఘ సంస్కర్తల కృషి ఫలంబు,
ఇందుగల రస్య భాషాదిక వనితలు,
నేర్పు నైపుణ్యతలే నెలవుగా మళయాళ
మగువలు,
తోడునీడగ నున్న, తమిళ, కన్నడీలు,
తేనె పల్కు లొలికించు, తెలుగు సోదరీమణులు,
చెలిమితో అందరు చేరి, సభకు అందములు తెచ్చె,
కంటికింపుగనుండు, బొమ్మల పనితనము,
కొండపల్లి ఘనత, కోటిపడగల నేర్తు,
నిర్మల, నైపుణ్య మిట్టిదని చెప్ప,
విభ్రాంతి గొల్పు వివిధ నాట్యభంగిమలు,
చిత్ర విచిత్రమై, చెలువారె బొమ్మలు,
మృగచర్మమిది యనుచు మూల వేసినదాని,
మృదువగు పనిముట్లు ముదితలు చేయును.
నాణ్యముతో అల్లిరి నారీజనంబులు,
అత్యున్నతములైన సజ్జలు. బుట్టలు
భావములు చేకూర్చ, భామినులందరు చేరి.
పుటలను కూర్చుచు, పొత్తములు చేయు,
చేమంతి పువ్వురంగు, చేడియల కందంబు,
బంతి పువ్వులరంగు ఇంతుల కందంబు,
చుట్టు చెంగావి సుదతుల కందంబు,
మల్లెమొగ్గల రంగు మగువకందంబు,
కలువ పువ్వద్దకము యువతుల కందంబు,
అద్దిరా, కుట్టిరా, అని నివ్వెరపడ,
అందాలు చిందించు అద్దకములతోను,
అమ్మల కమ్మగా దుర్గమ్మను,
చెలిమియే బలిమిగా మెలగుడని సుగుణములు
చెప్పు సుగుణమ్మకు,
మైత్రియే రూపొందిన మైత్రేజి, లీలగార్లకు
ఏమరక, పనిచేయు ఏర్రైజ, గురువులకు,
శ్రమయనక లాలించి చేరదీసెడి ఇందిరమ్మకును,
అన్నివేళల, అంజలి ఘటించి మ్రొక్కెదము;
భావిసుదతులకు బాటలను చూపుచు
ముదముతో ఈసభ ముందరకు నడవ
దీవించి దైవము దీవనలీయాలి.

ఎమ్. సరోజిని.





# తెలుసుకో....అ. అంజనీబాయి

క్షణం క్షణం కణం చొప్పున విద్యాధనములను గడించు.

క్రోధమును క్షమచేత, గర్వాన్ని వినయంచేత జయించాలి.

గర్వం గౌరవ కాంక్షికి గరళం లాంటిది.

అక్షరజ్ఞానం లేని ఆడంబరము అపహాస్యానికి కారణం.

అన్నీ తెలిసి అల్పజ్ఞుడననే వాడే అనుభవశాలి.

అల్పవిద్య, అల్పధనం అధికగర్వానికి కారణాలు.

ఇతరుల తప్పుల నెంచేముందు నీతప్పులను సవరించుకో.

ఆత్మస్తుతి, పరనింద ఆర్యసమ్మతం కాదు.

కాలుజారితే తీసుకోవచ్చుగాని, నోరుజారితే సర్దుకోరాదు.

తన తప్పు తెలుసుకొంటే ధన్యాత్ముడే.

తెలియనిదాన్ని తెలిసినట్లు నటించడం తెలివితక్కువతనం.

ధీరులు కార్యసిద్ధివరకు దీక్షవిడువరు.

నిజమైన మహాత్ముడు నిగురు గప్పిన నిప్పువలె ఉంటాడు.

ధర్మం యెక్కడుంటే జయం అక్కడే ఉంటుంది.

నీచులు కయ్యాన్ని, సాధువులు శాంతిని కోరుతారు.

పట్టుపట్టరాదు, పట్టి విడువరాదు.

అహంభావం ఆత్మనాశనానికి, నిరాడంబరం ఆత్మానందానికి కారణం.

ఉత్తమమైన కులవిద్య కుటుంబ యాత్రకు జీవగఱ్ఱ.

పరుల దోషాలు యెంచేముందు నీతప్పులకు ప్రాయశ్చిత్తం చేసుకో.

ఐకమత్యమే మహాబలం.



మా హేండిక్రాఫ్ట్స్ యిన్స్టిట్యూట్ పేము, వెదురు
విభాగంలో తయారయిన కళాఖండాలు.



# ‘కళ’లోని మా అధ్యాపకుల రచనలనుండి.

.... The beauty is though she is occupying such a high position and became the better half of such an august person like Chintaman Deshmukh she is yet our simple and humble Durgabai.

— Ethiramanujaiah

.... Colours bring warmth, hope, happiness and understanding without which a situation analogous to desolation is bound to creep up. Colour has a language of its own and expresses its significance.

— B. Maitra

....చేనేత వస్త్రములు దేహారోగ్యమును పెంపొందించును. “వేసవి చలువయు, చలివేళల నుష్ణగుణమును సముచిత భంగిన్ కలిగించు” నని నానుడి .... నిరక్షరాస్యతవల్ల, గృహపరిస్థితులవల్ల నైరాశ్యమునకులోనైన స్త్రీజనముల పాలిటి కల్పతరువు, ఆంధ్ర మహిళా సభ చేనేత విద్యాకేంద్రము.

తటవర్తి ప్రసాదరావు

... The artists and architects of yesterday led a devoted life. Dedication to the cherished ideal and translation of an envisioned ideal into reality involved their life-long devotion. It was a Tapas for them.

L. Venugopala Rao

....An ill qualified craft teacher will not only fail in his task but will bring discredit to the new movement which is struggling very hard to help the education system to find a healthy balance.

—G. G. Aire

# میری آواز

اِدھر آؤ بہنو میرے پاس آؤ
فنونِ لطیفہ کے تم گیت گاؤ
نہ صنعت و حرفت سے تم منہ کو موڑو
فنونِ لطیفہ کی مت باگ چھوڑو
یہ مانا کہ ہے علم کی قدر زاید
مگر کون ہے فن بنایا مجاہد
زمانے کی عورت ہے ہر کام کرتی
مگر ہے بہت پیچھے بھارت کی بیٹی
اٹھو آؤ ہم بھی کریں خوب محنت
بتائیں کمال اپنے اور اپنی ہمت
چلو اپنی بہنوں کو جا کر سکھا دیں
زمانے کی ظلمت کو پیچھے ہٹا دیں
لِدَر ورک سیکھو فرش ورک سیکھو
کھلونے بناؤ کین ورک سیکھو
یہ رنگوائی چھپوائی ہے بہترین فن
بہت اہم ہیں پر ہیں کاغذ کے یہ فن
تم ہینڈ لوم کو بھی بڑھاؤ جو آگے
کرو دور افلاس بڑھو سب سے آگے
سیکھو کوئی فن اور بڑھو اس میں آگے
کرو اس میں ایجاد دن دن نرالے

تم اپناؤ فن کو یہ ہے میری آواز
سُناؤ وطن کو یہ ہے میری آواز

از:- تراب النساء لِدَر ورکس

# BEAUTY THROUGH LEATHER

*Give handiwork the dignity it merits, and it will then become a thing of Beauty*

**Shyamala Sundar.**

The introduction of fancy leather craft in the field of handicrafts is quite a recent one. Yet it has captured the fancy of the buying public to such a degree that the demands for fancy leather craft are steadily increasing. Unfortunately this craft has been confronted with the keen competition of machine-made goods. However the prospect of this craft is bright.

The craft is becoming pleasant and popular and its success is based more on the design. Of course workmanship always comes first and last, because when workmanship is wedded to an appealing design, the product becomes a thing of beauty. And a thing of beauty is a joy forever. So we see that the craft can easily compete with the higher grades of machine made goods or even t can outweigh the leather by exercising little ɔatience and imagination in the direction of lesign and decoration.

The all India · Handicrafts Board has ɔen generous enough by opening various ɜsign centres, that cater to the needs and stes of the ever increasing trend in the craft.

So far as the design is concerned, the ɔst throtling problem has been solved and ıat remains can be over-come by our own ɪdence. Therefore the approach should be a !culated one. This will help us to eliminate undue wastage of time and material. The entire making of the article must be carefully done, whether it is sewing or thonging or lacing, or staining. The subject must be planned segaciously and deliberated closely before taking it for execution. Decorations are to be done judiciously avoiding excesses. The decoration should be made according to the nature of the article since the shape and making of the article comes under first consideration.

It is highly beneficial that paper pattern is first made to ensure the success of the article. This will also bring down wastage to its minimum. Pattern making is a matter of prime importance. When this is done accurately half the work is over. Accuracy in pattern making and the subsequent operations will produce work of high standard. The suitability for purpose is another factor that should not escape our attention. Articles that suit our purpose or way of living should be produced since such work will give us satisfaction.

It is needless to accommodate our thoughts in countless articles. Tastes are changing, demands are changing and time is changing. In this changing world we must choose such projects that will produce useful products and give our handwork the dignity it merits.



agony of desperation and it appeared as though every move of the cart wheel crushed his tiny heart. Despair, depression and frustration overwhelmed him and I saw the misery of the whole world written on his little face.

I saw, I was moved and I felt that I too was missing something precious. I rushed out and called back the hawker. I approached the lad, laid my hand on his shoulder and saw warm tears rushing down his cheeks.

I picked out the Banjara belle from the cart and placed it in the hands of the boy. Doubt, delight and ecstacy appeared on the boy's face at this unexpected turn of events. He could not even speak but his eyes sparkling with blissful joy spoke more than his tongue.

"Who is he?" asked the hawker in surprise.

"He is a child", I beamed.

" Whose ? "

" God's ".

The hawker shrugged his shoulders in bewilderment and nodded his head. The huge and hefty man with a chest as broad only the language of his own species—the language of bone-breakers and skull-crackers.

I paid the hawker two rupees, the amount with which I hoped to see the picture. This meant that I had to forego the pleasure of the cinema and wait till the first of the next month. Yet this did not in any way damper my spirits. The thought that I was able to bring joy to the heart of a small boy made me feel all the more happier.



# ఆంధ్రమహిళ

ఏకైక మహిళాభ్యుదయ మాస పత్రిక



ANDHRA MAHILA

# ఆంధ్ర మహిళ

సంపుటి 17 | అక్టోబరు 1961 | సంచిక 10


అక్టోబరు ఒకటవ తేదీని విడుదలవలసిన యీ సంచికను యింతవరకూ ఆపుచేసాం; ఆంధ్రమహిళా సభ, హైదరాబాదు శాఖ శంకుస్థాపనోత్సవ శుభ సమయమున తమను దర్శనం చేసుకోగల కుతూహలంతో. పునర్దర్శనం నవంబరు 5-వ తేదీని.

—ఆంధ్రమహిళా సభ.

## విషయ సూచిక



## చందాదారులకు

### విజ్ఞప్తి

మావిన్నపాన్ని మన్నించి, కొందరు చందాదారులు తమచందాలు పంపినా, ఇంకను చాలమంది పంపకున్నారు. వారికి సక్రమంగా ప్రతినెల 'ఆంధ్ర మహిళ' మాత్రం పంపుతున్నాము, వారియెడ మాకు ఉన్న విశ్వాసాన్ని పురస్కరించుకొని అయినా, సాధ్యమయినంతత్వరితంగా చందాలుపంపి, యెప్పటిమోస్తరే 'మహిళ'ను పోషించాల్సని కోరుతున్నాము. లేనిపక్షంలో వారికి పత్రికపంపటం మానుకోవలసివస్తుందని మనవి చేస్తున్నాము.

మేనేజరు,
"ఆంధ్ర మహిళ"




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 17 :: అక్టోబరు, 1961 :: సంచిక 10

# సతీపతుల అనురాగం

"పడతి నొక్కదాని విడిచి యించుక యమృ
తంబులేదు, భువి విషంబులేదు,
అమృతలత లతాంగి యనురాగవతియైనఁ
గాక మెలఁగనేని గరళవల్లి ॥"

భర్తృహరి శ్లోకానికి పై పద్యానువాదం ఏనుగు లక్ష్మణకవిది. దాని అభిప్రాయం, ఏమంటే, ప్రపంచంలో ఎన్ని జంగమస్థావరరూప పదార్థాలున్నా, స్త్రీ ఒక్కర్తె లేకుంటే అమృతమే లేదనీ అమృతం ఎలాగు స్వర్గంలోని దేవతల కానందాన్ని ఇచ్చేవస్తువో, అలాగే భూమిలో పురుషజాతికి అంగనాసంఘం ఆనందాన్ని ఇచ్చే వస్తువని మరొకవిధంగాకూడా దీనికర్థం చెప్పుకోవచ్చు. 'అమృతం'అంటే చావులేనిదని కదండి. అమృతం లభించకముందు దేవతలుకూడా మరణిస్తూ వచ్చారు. ఇక మానవజగత్తులో అందరనూ మర్త్యులమేగా! మర్త్యులంటే మృతిచెందేవారని, కనుక మృతిలేకుండా వుండాల్నంటే అనురాగవతి అయిన మహిళయే పురుషులకు అమృతలత అవుతుంది. లేకుంటే, ఆ వనితే గరళవల్లి అంటే విషవుతీగ మోస్తరుగా తయారవుతుందన్నమాట!

భర్తృహరి 'లతాంగి'ని గూర్చి మాత్రమే ఆమె అనురాగవతిగా ఉండాలని చెప్పాడు; కాని పురుషుడనురాగవంతుడుగా ఉండాల్సిన అవశ్యకాన్ని గురించి చెప్పాడుకాడు. ఇది పాక్షికాభిప్రాయంగా తీసుకోవలసినట్లు తోస్తుంది. గార్హస్థ్య ధర్మ నిర్వహణమంతా అబలాలోకంతోనే ఉండగా, ఆమెని అనురాగంతో ఎంత మిక్కుటంగా భర్త చూస్తే సంసారమంత వృద్ధికి వస్తుంది.

నిజం చెప్పాలనంటే, మహిళామణిని మన పూర్వులు విపరీత నిర్బంధాల సంకెళ్ళతో కాలు చేతులు బిగించి భర్త గృహమనే చెరసాలలో పడతిని బానిసగా పడేశారు. అంతతో లేని అధికారాలు తెచ్చుకొని భార్య అంటే, ఏదో విలాసవస్తువుగా, తనయింట్లో ఆరవచాకిరి చేసే దాసిగా, తన సంతృప్తికోసం మెలగాల్సిన యంత్రంగా ఎంచి మగడు చరించేవాడయ్యాడు. ఇందుకు ముఖ్యముగా, మన ప్రాచీనార్యులు పాతివ్రత్యానికి ఇచ్చిన ప్రాధాన్యమే కారణం, ధర్మార్థకామములు మూటిలోను భార్యాభర్తలు, సమభాగులు. కాని వాటిని అనువర్తింపచేయటంలో విభిన్నత్వం కనబడుతున్నది. అవి స్త్రీ యెడల పరిశీలించేంత నిశితంగా పురుషులయెడ పరిశీలింపకపోవటంలో పెద్దపొరపాటు చేసిందనాలి,

పురుషులలో శ్రీరాముడు ఒక్కడు మాత్రమే ఏకపత్నీవ్రతుడు. పతివ్రతలన్ననో కోకొల్లలు, భర్తలను అనురాగంతో చూడని స్త్రీలు చాల అరుదు. భార్యలను అలసభావంతో చూచే భర్తలు మాత్రం నూటికి ఏ తొంభ

యిమందయినా వున్నారనటం సత్యదూరంకాదు. తాము విద్యల్లో పట్టభద్రులై పాణిగ్రహణం చేసుకున్న పురుష లలో ఎందరు చదువుతున్న తమ అర్ధాంగుల విద్యాభ్యాసం మాన్పించటంలేదు? సరిక్రొత్త ఫాషన్లను అనుసరించి యెప్పటికప్పుడు తమ వేష భాషలను మార్చుకొంటూండే నవనాగరికులలో ఎందరు తమ భార్యలు సినిమాతార లను అనుకరించటాన్ని ఈసడించటంలేదు, అన్య వధూమణులతో స్వేచ్ఛగా సంభాషించే సంస్కారుల్లో ఎందరు తమ సతీతిలకాలు పరపురుషులతో మాటాడ్డం గర్హించటంలేదు? ఈలాటి సామాన్య విషయాల్లోనే పొత్తుకుదరని ఆలు మగలు ఆన్యోన్యం అనురాగంతో ప్రేమిస్తారనటం కేవలం భ్రమ.

సతీపతులమధ్య అసలు అనురాగాన్ని పెంపొందించేది వారిసంతానం. సంతానం కలగక ముందు భార్యా భర్తలు పరస్పరం ప్రకటించే అనురాగాలు, సంతానం కలిగిన తరవాత వారియందు కేంద్రీకృతం అవుతుంది. అది స్వచ్ఛమయిన కుటుంబ నిర్వహణకు ఉపకరించే ప్రేమానుబంధమై వెనవేసుకొని సుఖానికి దోహదమవుతుంది. అట్టిసందర్భంలో సంసారభారం చాలవరకు మోసేస్త్రీ అమృతలతగా భాసిస్తుందనటంలో అతిశయోక్తి యేమా త్రంలేదు. అట్టిఅమృతలతను పురుషుడు త్రికరణశుద్ధియైన అనుగారాగంతో ప్రతిసాంసారికవిషయంలోను ఆదర పూర్వకంగా అనుసరించటం ధర్మం.

భార్యాభర్తల అభిప్రాయాలేకీకృతం అయినప్పుడు అనురాగం అచంచలంగా నిలుస్తుంది, అది శాశ్వతం కావాల్నంటే వారిరువురూ మనసులో మనస్సుగా ప్రవర్తించాలి. అనగా ఏ విషయంలోనైనా సరే, ఏక మనస్సుతో ఏకోన్ముఖంగా కార్యాలు సాధించాలి. మాతృ పితృ భ్రాతృ పుత్ర మిత్ర జనుల విషయాల్లో చూపు ప్రేమ వేఱు. తనమేన సగముభాగమును పంచుకొన్న అబలామణియెడ చూపుప్రేమ వేఱు. మొదట పేర్కొన్న వారికి చూపు ప్రేమ, కార్యావసరములనుబట్టి కొంతకాలమువరకు గాఢముగా నుండవచ్చును, ఆ తరువాత అది తొలగనైన తొలగ వచ్చును. లేదా విభజింపబడనైన విభజింపబడవచ్చును. కాని భార్యయందలి ప్రేమ భర్తకును భర్తయం దలి ప్రేమ భార్యకును ప్రకృతి సిద్ధముగ స్థిరముగ నెల్లప్పుడుండునది. వారి పరస్పర ప్రేమ విభజింపబడరానిది.

ఎప్పుడైతే, భర్త తనకు చూపదగిన అనురాగాన్ని అన్యలయందు చూపుతాడో, ఎప్పుడైతే తనమీది ప్రేమానుబంధాన్ని విభజించి తెగద్రుంచి మరొకతెకు ఇయ్యడానికి సిద్ధపడతాడో, అప్పుడాయిల్లాలికి (సహజంగా ఓర్పుగలదయినా) ఓర్పు అనేది ఈషణ్మాత్రం ఉండదు. సంసారంమీద అక్కరవుండదు. సంతానంమీద ధ్యాస ఉండదు. సంఘానికి వెరచినదై ఆ భర్తతో విధిలేక కాపురం వెలగబెట్టుతుండినా, లోలోపలనే చెప్పరాని ఆవేద నతో విచారంతో క్రుంగి, కృశించి పోతుంటుంది. అట్లని స్వాభిమానాన్ని చంపుకొని యిరుగు పొరుగు అమ్మ లక్కలతో కూడా తన ప్రవర్తనను గురించి తలపోసుకోదు. కాని ఇంటిలో భర్తకు వ్యతిరేకంగా నడుచుకుంటూ ఎడముఖం పెడముఖంగా తిరుగుతూ వుంటుంది. ఈ పరిస్థితుల్లో పుట్టింటికి పోవటంకూడా అపఖ్యాతి అని భావిస్తూ వుంటుంది. సంతానవతి అయితే ఆ పిల్లలమీది మమకారంచేత సంసారాన్ని అంటిపెట్టుకొని సన్యాసినిగా భరిస్తూ వుంటుంది. సామాన్యసంసారిణి మరి అంతకంటె చేయగలదేముంది? అలా కాకుండా గడసరిగడుగ్గాయలు, కయ్యా లంటే కదంతొక్కే కుటుంబాలలో పుట్టి పెరిగిన స్త్రీలైతే విషపు తీగెలు, (గరళవల్లులు)గా మారి, తమ్మవమాన పరుస్తూ, యితర వనితలను నెత్తికెక్కించుకొనే పతుల ముఖం, ఇంటిలో కనబడినప్పుడల్లా ఏదో ఒక నెపంతో చీటికి మాటికి తగవులాడుతూ రణగుణ ధ్వనులుచేస్తూ, సంసారాన్ని నరకప్రాయం చేసుకుంటారు, అలా ఎన్నా ళ్ళని భరిస్తారు? ఆఖరుకు విసుగుచెంది, ప్రాణమే భారమని యెంచి దేహత్యాగానికైనా పాలుపడతారు. లేదా త్రాచుపాము మోస్తరు మగనిమీద కాటేయటానికైనా అవకాశం చూస్తుంటారు. మొదటిరకంవారు గయ్యాళు లయినా, శరీరం చాలించి, ఆత్మగౌరవం కాపాడు కొంటారు, రెండోరకంవారు కట్టుకొన్న పురుషుడలా పరిభ వించినప్పుడు మనమేల అతడిమార్గాన్నే ఆవలంబించరాదని, మరొక పురుషుడితో స్నేహం చేయటం అతడి మూలంగానే నిజభర్త ఉసురుల కెసరుపెట్టటం జరుగుతుంది. కనుక ఇట్టి స్త్రీలు అమృతలతలు కాకుంటేమానె; కాని గరళవల్లులయ్యేంతవరకు పగ పెరగటం ప్రమాదకరం.

ముఖ్యంగా సంసార శకటాన్ని లాగే యెడ్లవిధంగా భార్యాభర్తలిద్దరు సమానమయిన వుజ్జీతో ఇహ లోకయాత్ర జరిపినప్పుడే కుటుంబాలు నిత్యకల్యాణం పచ్చతోరణంగా ప్రకాశిస్తాయ్. అట్లుకాకుండా వారిరువురు ఏటికొకరీడిస్తే కోటికొకరీడిస్తూ, వుండేంతవర కాయింటిలో పెద్దమ్మ తాండవాలు, అగ్గిబరాటాలు చెలరేగటం మూటికి ముమ్మాటికి నిజం. "ఆడుదిలేని యిల్లు అడవి, మగవాడులేని యిల్లు మఠం" అనే సామెత వుండనే వున్నదికదా. స్త్రీ పురుషులలో ఏ ఒక్కరు లేకపోయినా సజావుగా సంసారం సాగదు. అంతేకాదు, భార్యాభర్తలొండొరుల మనస్తత్వాలు పరస్పరం అవగతమై వుండాలి. భర్త తనయెడల మనస్తాపాన్ని చెందే చర్య భార్య చేయకూడదు. భార్య తనయెడల అసహ్యాభావాన్ని చూపే చేష్ట భర్త చేయకూడదు. అప్పుడామె భర్తను అనురాగామృతవారిధిలో ముంచి తేల్చడం సహజంగా ఏర్పడుతుంది. కావున భార్యలను అనురాగలతలుగా గాని, గరళ వల్లులుగాగాని, మారేటట్లు చేయగలది భర్తల ప్రవర్తనలని పురుషులు గ్రహించి సాంసారిక జీవితం నడపటం వారి విధ్యుక్తమయిన కనీసధర్మం. పాశవస్వభావాన్ని మాని, మానవులు మానవస్వభావానుగుణలక్షణం అలవరచుకొన్నప్పుడే మానవపదవాచ్యులు కాగలుగుతారు.

---

# మబ్బుల మాటున చందమామ

## శ్రీ భైరవభట్ల వేం. రామబ్రహ్మశ్రీ

అది తలిరాకునేల, మలయానిలముల్
పయిపీచుచుండె, స
మ్మదమున కూరుచుంటిని, హిమాంశువు
మబ్బుల డాగినాడు నె
మ్మదిగను వచ్చునో? మరల మమ్ముల
జూచునొ అట్లె పోవునో!
వదలవు వానిఁ జూచు మదివాంఛలు-
శీతల మారుతమ్ములో॥

సరవి వెలుంగుతో అరుణచంద్రికతో
విమలాంబరమ్ములో
దరహసితాననమ్ము సరదాలను
కుల్కుచు నుండగా బలే!
చరచర వచ్చినావు మధుసౌరభముల్
వెదజల్లినావు నీ
సరస వనమ్ములో ప్రమద చంద్రికలో
విహరింప జేయుమా!॥

ఓహో! నీయుదయించుటల్ పరమ
సౌఖ్యోదంతముల్ నీరుచుల్
బాహాటంబుగ వ్యాప్తి చెంది మధు
భావాలే ప్రసారించె మా
యూహా ధూములలోన కోరికలవేనోయీ
తలిర్చెన్ మహో
త్సాహం బాయె గదోయి, నీవదన
లాస్యంబుల్ విలోకించినన్॥

ఆ వినిర్మలాభ్రతలాన అప్రశాంత
సంచలిత మేఘమండల ఛాయలోన
నీవు దాగిలి మూతలాడే క్రమాల
చూచినానోయి, నీముద్దు సోయగాల॥

నీల పయోదమే! యొకటి నీరుచి
రాంశువులన్ని గప్పెనో,
యీ! లలితాంబరమ్ము కళలే మసి
పట్టెగదోయి! నీవుసౌ
ఖ్యాలకు పుట్టినిల్లు సర
సాలవె నీచిన నాటి ఉగ్గులో
చాలు, అభాగ్యమానవులపై
మధురాంశుసుధల్ స్రవింపుమా!॥

మారుత మేలనో పరువుమాలెనో
నీనికటమ్ములో, మహా
దారుణ మయ్యెనోయి!, నినదాలు
వినంబడ కుండుటల్ భవ
చ్చారులసత్తలంబుపయి - చాలుర
నీకడ కేగుదెంచి నే
నారయ నేమిజేయుదు సుధాకర!
పిల్చగ గాలిలేనిచో!॥

[చంద్రలోకంలో గాలి, నీరు అరుదు అని సైన్సు చెపుతుంది.]

ఏమి విద్యుత్ప్రభావమో- ఏఅపార
బలము చేతనో మేఘాల పైన నుందు,
మబ్బులను త్రిప్పి వైతువే మాయచేత,
నీకుచుట్టును సేవకా నీకమువలె॥

మేలములేల! నాయెడఁద
మించినచంద్రికలోని సౌకుమా
ర్యాలను చూచి పొంగి ప్రమ
దాంబుధిలో విహరించి అంతరం
గాల మునింగెరా! మధుర
సౌరభముల్ తెగద్రావి భావపు
ష్పాలివె పూచెరా! హృదయ
పంచవటీ నవభవ్య వీధులన్.

ఒక్క పున్నమ రేయియేనోయి! నీవి
లాప రూపురేఖా శరద్భాసురాంశు
లాలితుండవై నామనోకీలితుండ
వై గగన సరోజాత పుష్పమ్ము వయితి.

నీతో ముచ్చట లాడగోరెదమురా!
యీ మమ్ము స్పుట్నిక్కులో
నీతో పల్కులు కుల్కుచున్ ముదముతో
నీచెంతనే యుండ సం
ప్రీతిన్ బాలురు కోరుచుండిరి పవల్-
రేల్ చందమామా! యికన్
నీతో సఖ్యము జేసి బాలురికపో!
నీయంతలై పోవరో॥

# నివేదన

## శ్రీ వై. రాంబాబు

ప్రభూ; సర్వాంతర్యామీ!

విన్నావా! నాహృదయాంతరంలో రాగ ఘంటిక నిస్వనం....—.... ఆగి ఆగి మ్రోగుతోంది ....ఘంటిక ఆగి పోయినా. స్వరలహరుల ప్రతిధ్వనులు గుండెగదుల్లో తారాడుతున్నాయి........"హరేముకుందా! .... హరే మురారీ!....గోవిందా!".... అని.

జగన్నాథా!

విని, నవ్వుతున్నావుగానీ,.... స్వామీ. నాతపఃఫలం మాటేమిటి? నాతపనతీరే మార్గమేదీ చూపవా? అదిగో చూడుము.... హృదయపీఠం నిన్నాహ్వానిస్తోంది· అందుకే పేరుపెట్టి నిన్ను పిలుస్తోంది.

దయార్ద్రహృదయా!

ఏదీ ఒకపరి నీపాదద్వయాన్ని నన్ను ముట్టుకోనీ! పిలిచి నంతనే పరువెత్తి వచ్చావుగదా! ఆర్తజనావనా! నీసుకుమార సుందరపదాలు కందిపోయాయి.... తాళుస్వామీ రత్నసం చయాన్ని ముఖారవిందాన పొటమరించిన చెమ్మటబిందువు లను చేలాంచలముతో తుడువనీ.... పాదములొత్తనా?- నాకెన్ని చేతులున్నవనీ!?....నీకు వింజామర వీచేదెవ రయ్యా?- పాలకై ఆలమందలవిగో! వెచ్చటిగుమ్మపాలు పిదికి యిత్తునా!

కరుణాపాంగా!

నీమధురదరస్మితజ్యోత్స్నలు నాలో అలమికొని కాం తిపుంజాలు కనుల మూయించినవి-స్వామీ, ఆనంద పారవ శ్యమున నేనిలువలేకున్నాను.

లక్ష్మీదేవిమాట నాకెందుకయ్యా! మీఅబ్బాయి మన్మ థుని ఊసుమాత్రమెందుకు?- ఏదీ, ఒక్కసారి నీ మోహన వేణుగానం మాత్రం విన్పించు- అంతేచాలు- నీమురళీరవళి లహరుల్లో నేనూ ఒకకణాన్నై ఓలలాడుతాను.

మోహనవంశీ!

భరింపలేకున్నాను స్వామీ! నీమోహనమురళిగా నేనూ కలిసి, మునిగిపోతున్నాను.

ఆలకాపరీ!

అలనాడు క్షీరబిందువొకటి నీతలమీది నెమలిపింఛముపై బడినంత ఆగోవు సుశీలయైనదే!... నీ మధురమురళీ-గానా మృత ఝురులలో బడిన నన్నేమిటని ఆశీర్వదింతువోయీ!

నీలమేఘశ్యామా! నగధరా!

ఆపుము- నీమురళీరవాన్ని, వినలేను. విని, విని, చెవులు మూసికొనిపోయినవి. ఈరాగఝురులు చాలు- వేనకు వేలుగా నాగుండెల దాగుకొన్నవిచూడు. రాగతరంగాల ఆవేగము, ఆపికోలేక పోతున్నాను.

మురళీగానలోలా!

నీవు వచ్చావు, నీకేమిచ్చేది? ఇదివరకే నామనస్సునసమ ర్పించి, వట్టిచేతులతో ఉన్నాను- ఇక నిన్నే నేను నీకర్పించుకొనుచున్నాడను.

# సుడిగుండాలు

(గత సంచిక తరువాయి)

గులాబీరేకులవంటి పెదవులమీద చిరునవ్వును చిందిస్తూ. ప్రపంచంలోని సౌందర్యాన్నంతా తన శరీరంలో మూసపోసుకుందా అన్నట్టు. ఒక సజీవ అజంతా విగ్రహాకారాన్ని స్ఫురణకుతెస్తూ, సవిలాసంగా అగుపిస్తూ అతని ముఖానికెదురుగా ఒక స్త్రీరూపం నిల్చుని ఉంది. లేత ఊదావర్ణపు చీరెలో మెరిసిపోతూ సాధారణ నిడివిలో ఉన్న ఒక అమ్మాయిని అతడు ఇప్పుడు స్పష్టంగా చూశాడు. నిటారుగ ఉన్న ముక్కు, లేత ఎరుపు వర్ణంలో దోబూచులాడుతున్న పెదవులు, ఆమె ముఖారవిందానికి ఒక క్రొత్త శోభను చేకూరుస్తున్నాయి. ఆమెయొక్క నల్లటి విశాలనయనాలు వెడల్పైన కనుబొమల క్రింద ఎంతో లోతుగాను గంభీరంగాను ఉన్నట్టు అగుపించాయి. అటువంటి కళ్ళను అతడు లోగడ ఎన్నడూ చూడలేదు. ఆ కళ్ళలో మెదుల్తున్న అనుభూతులు, ప్రస్ఫుట మౌతున్న అనుభవాలు అతనికి అర్థంకాలేదు. అర్థంచేసుకోవటానికైనా ఏమీ అంతుచిక్కలేదు. నల్లటి మేఘాలవంటి కురులమధ్య ఆమె ముఖం తెల్లటి చందమామలాగ అగుపిస్తోంది. వింతసోయగాన్ని వెదజల్లే ఒక అందాలబరిణె తన ముందు నిల్చుని ఉంది అనే విషయం, అతనికి కలయా లేక నిజమా అన్నట్టు భ్రమింపచేసింది. తన అధీనం పట్టుదప్పినట్టు, తెలివి బొత్తిగా నశించినట్టు అతడు ఆశ్చర్యంతో స్తబ్ధుడై మూగగా నిల్చున్నాడు. అతడు తనస్థితిని జాగ్రదవస్థకు తీసుకువచ్చాడు. కృతజ్ఞతతో నిండిన కళ్ళతో, పట్టుదప్పిన ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో అతను ఆమెవైపు రెండు మూడు క్షణాలు తదేకంగా చూశాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది. చంద్రుని వెన్నెల పడటంవల్ల ఆ లేత ఉదావర్ణపు చీరెలో ఉన్న ఉషారాణి ఒక్కమారు విద్యుల్లతలాగ తళుక్కుమంది. "హేమంత్! చంద్రుడు ఎంత అందంగా అగుపిస్తున్నాడో చూడు, రా వెడదాం, వెన్నెలలో అల్లా తిరిగొద్దాం" అని అంటూ ఆమె అతన్ని తటాకం వద్దకు లాగుకొని పోయింది. కాంతియుతమైన వజ్రాలు నేలరాలి కళ్ళను మిరుమిట్లు గొలిపే సౌందర్య శోభను వెదజల్లినట్టు, ఆమె నడకలోని కదలికలలోని సౌందర్యం అలలు అలలుగా చుట్టూ ప్రదేశాన్ని ఆవహించి ఒక విధమైన క్రొత్త అందాన్ని విరజిమ్మాయి.

కరకు హస్తాలు రెండు మెత్తని పుష్పాలమీద విశ్రాంతిని తీసుకున్నాయి. తటాకం మధ్యలో తళతళమని మెరుస్తూ, చుట్టూ పచ్చటి చెత్తచేమతో నిండి ఉంది. చంద్రుని వెన్నెలవల్ల నల్లటి నాపరాళ్ళుకూడా వెండిపూత పూయబడ్డట్టు జిగేలు మంటున్నాయి; "ఇక్కడకురా! హేమంత్, ఇక్కడకురా! నా వద్ద కూర్చో! ప్రణయ సామ్రాజ్యంలో ఇరువురి మధ్య ఏలాంటి వ్యత్యాసమూ లేదు. ఈ సామ్రాజ్యంలోని అసాధారణ సమానత్వమే ప్రేమికుల అన్యోన్య అనురాగాలకు శ్రీరామరక్ష. ఇప్పటివరకు ఈ విశాల ప్రపంచాన్ని చూడాలని పోరాడేవు. ప్రపంచంతోపాటు ఉషారాణినికూడ బాగాచూడు." అని అంది ఆమె.

"పలుకు! మాటాడు!" అని అంది ఆమె.

"ఉషారాణి! నీ హస్తాలు పుష్పాలతో చేయబడ్డాయి. నీ హృదయం బంగారుతో చేయబడింది. నీవు నా కొరక శాశ్వతమైన కానుకను సమర్పించావు. ఒక సరిక్రొత్త జీవితం ... నీవు నా దేవతవు..." హేమంత్ గొంతుకాస్త బొంగురుపోయింది. కొంతసేపు ఆగి మరల అతను మొదలెట్టాడు. గడచిన ఈ కొద్ది కఠినపురోజుల్లోనూ నీవు నాకంటె అమితంగా బాధ ననుభవించావు. నీవు నీ యజమాని, మిత్రులు, తరితరుల దూషణలను, దూషణాలుగ ధరించావు. నీ ఆనందాన్ని చాలవరకు త్యాగం చేశావు. ఏమీలేని నాకు సర్వం సమకూర్చావు!"

"నీకూ ఏమీకొరతలేదు!" ఆమె అస్పష్టంగా అంది. అతడు ఆమె పలుకులు వినలేదు. అతడు తన ధోరణిలో తాను చెప్పుకు పోతున్నాడు. "ఆనందాతిశయంతో నాకు పిచ్చిపట్టినట్టుంది, ఉషారాణి, నాకు తెలుసు. వెల కట్టశక్యంగాని నీ అమూల్యదయార్ద్రతకు నేను బదులు తీర్చుకోలేను ఉషారాణీ, ఇప్పుడు నాకు కళ్ళున్నాయి. నేను సర్వం చూడగలను. కానీ నాకు నిన్ను తప్ప ఏ వస్తువును చూడాలన్నా ఇష్టంలేదు, బొత్తిగా ఇష్టం లేదు" అని అగాడు.

నీలాంబర వీధిలో రేరాజు ఇంకా ప్రయాణం సాగిస్తూనే ఉన్నాడు. ఉన్నట్టుండి రేరాజు చుట్టూ కారుమబ్బులు క్రమ్ముకున్నాయి. కానీ అవి అట్టే సమయం ఉండలేదు. మబ్బులు క్రమంగా విడిపోగానే మరల

ప్రపంచంమీదికి వెలుగుకిరణాలు ప్రసారమయ్యాయి. హేమంత్ ఏవేవో చెబుతూనేఉన్నాడు. ఉషారాణి అతను చెప్పేవాటిని శ్రద్ధగా వింటోంది, ఏదో కథ వింటున్న చిన్న బిడ్డలాగ. నీటిలో "గళక్" మన్న చప్పుడైంది. నీటిలో చేపలు దాగుడుమూత లాడు తున్నాయనీ, అకాశంలోని అసంఖ్యాకమైన తారలు ఈ ఆటను చూచి ఆనందిస్తున్నాయనీ హేమంత్ వెను వెంటనే గుర్తించాడు.

"ఉషారాణీ, నీవు మౌనం వహించా వెందుకూ? మాట్లాడవేం?"

"ఉహూ ! ఈరోజు నీకు వెలుతురు అగుపించింది. కానీ నేనే అంధురాలనయ్యాను. నీవు తప్ప నాకం టికి మరేమీ ఆగుపించటంలేదు" అని అంది. ఆమె కళ్ళలో కరుణ తొణికిసలాడింది' పెదవులమీద చిరు నవ్వుచిందులాడింది. ఆమె ముఖంలోదరహాస రేఖలు పొడజూపాయి.

ఆమె పలుకులకు అతను చలించి పొయ్యాడు. "ఉషారాణి, ఏమంటున్నావ్? నీకు నేనుతప్ప మరేమీ అగుపించటంలేదా? నామీద నీకున్న అభిమానాన్ని పురస్కరించుకొని నన్ను గౌరవిస్తున్నావు. కానీ నేను ఇదివరకు ఒకఅంధుణ్ని, భిక్షుకుణ్ని...'అంధభిక్షుకుణ్ని' అన్నవిషయాన్ని మాత్రం మరచిపోకు."

"నిన్ను అంధభిక్షుకుడని ఎవరంటూరు?" అని ప్రశ్నించింది ఆమె. ఉషారాణి అతన్ని సమీపించి అతని హస్తాలను చేతికి తీసుకొని "హేమంత్, నీవునా సామ్రాజ్యాధిపతివి. నా హృదయ పీఠమలంకరించిన ఏకైక ప్రేమ స్వరూపుడవు" అని అంది. " నీ వెంత మధురంగా మాట్లాడుతావు ఉషారాణి, నీ మాటల్లో మకరందాన్ని క్రుమ్మరిస్తావు !" అని అన్నాడు హేమంత్.

"నిజంగానా?" అని అంటూ ఉషారాణి ఆనందం తో ఉప్పొంగి పోయింది. తన పెదవులను అతని పెద వులదరికి చేర్చింది.

జయదేవ్ ఈ చర్యలనన్నిటినీ చూచి ఓర్వలేక పోయాడు. ఈ సమస్యను ఎల్లా పరిష్కరించాలో అతనికి అర్థంకాలేదు. "హేమంత్‌కు చూపురాగానే ఉషారాణిలో ఎంతో మార్పు వచ్చింది. ఇక తాను అక్కడ ఉండాల్సిన అవసరం ఏమీలేదు. తనతో ఎవ రికీ ఏమీ పనిలేదు. ఉషారాణికి తన మాటలతో అవ సరం తీరిపోయింది." ఈ ధోరణిలో ఆలోచిస్తున్న జయదేవ్ హృదయంలో సందేహాల తుఫాన్ చెలరే గింది. అందువల్ల విశ్రాంతి కొరవడింది. పరిస్థితులను, పరిశీలించేకొద్దీ అతని సందేహాలు ద్విగుణీకృత మయ్యాయి.

ఆమెను సక్రమమార్గానికి తీసుకురావటానికి ప్రయత్నించమని జయదేవ్ ఒక పనికత్తెకు ఆదేశిం చాడు. ఆమె ఇటువంటి ఉన్నతస్థితికి తీసుకురావ టానికి తాను వెచ్చించిన డబ్బునుగూర్చి ఉషారాణి తో చెప్పటంద్వారా "నీవు నీ విధులను సక్రమంగా నిర్వహించటంలేదనీ, స్టూడియో కార్యక్రమాలపట్ల అశ్రద్ధ చూపుతున్నావనీ" మున్నగు అంశాలను పరో క్షంగా ఆమె ముందు ఏకరువు పెట్టాడుకానీ, అవన్నీ "చెవిటికి సంకూదినట్లు" నిష్ప్రయోజనాలయ్యాయి. ఇందుకు ఒక్కటే కారణం. ఉషారాణి డబ్బునుగూర్చి ఏమాత్రం లక్ష్యపెట్టక పోవటం. ఆమె తోటిమానవుల బాధలతోబాటు విలువలను తెలుసుకుంది. డబ్బుకు అత్యల్పప్రాధాన్యత నిచ్చింది. ఉషారాణియొక్క ఈ ధోరణినే జయదేవ్ తీవ్రంగా నిరసించాడు. ఈ స్వభా వాన్ని తీక్షణంగా విమర్శించాడు. ఆమెను ఏవగించు కొన్నాడు.

అది ఉషారాణియొక్క ఇరువది రెండో జన్మదినో త్సవం. విశ్రాంతిలేని హృదయంతో జయదేవ్ ఆ విశా లభవనంలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. కిటి కీలగుండా చల్లటి పవనవీచికలు దూసుకవచ్చి తాకే కొద్దీ అతని హృదయం రాజేసిన నిప్పులాగ అవేదనతో దహించుకు పోతోంది. సముద్రంలోని కెరటాల్లాగ, అతని మెదడులోని ఆలోచనలు ఒకదాని తర్వాత మరొకటి దొర్లుకొస్తోంది. సాధ్యమైనంత వరకు హేమంత్ ముఖాన్ని చూడకుండా భవనంలో పైకి, క్రిందికి అల్లాగే తిరుగుతున్నాడు, కాళ్ళుగాలిన పిల్లి లాగ. కొంతసేపటికి కాళ్ళు నొప్పిపట్టటం, బరువుగా తోస్తున్న శిరస్సుకు చెయ్యిచేర్చి ఒకచోట కూర్చుని ఆలోచనల్లో మునిగి పొయ్యాడు. అప్పటికప్పుడే దిన కరుడు పశ్చిమాద్రిని క్రుంగటంవల్ల విశ్వాసాన్ని చీకటి తెరలు కప్పివేశాయి. ఉన్నట్టుండి సంభ్రమంతో, ముఖంలో కాంతిని ప్రదర్శిస్తూ అతను తటాలున లేచి నిల్చున్నాడు.

విద్యుద్దీపాల కాంతిలో లేత అకుపచ్చని వర్ణంతో ధగధగమని మెరసిపోతున్న చీరెను ధరించి ఉషారాణి

# సుడిగుండాలు

(7-వ పేజీలోని కట్టకడపటి "ప్రత్యేకంగా" అనే పదం తరువాత ఈ క్రింది విషయం విడిచిపోయినందుకు పాఠకులు మన్నించాలి.)

—ఆం. మ. సం.

తయారుచేసిన ద్రాక్షరసంలో కలిపాను. ఈ విషయం ఎవ్వరికీ తెలియదు. ఎవ్వరూ చూడలేదు" అని దృఢంగా విశ్వసించాడు. హేమంత్ తన గ్లాసును ఉషారాణి యొక్క సుదీర్ఘ ప్రేమ పూర్వక జీవితానికి శుభవచనాలను వల్లించాడు. ఉషారాణి కూడ తనగ్లాసును పైకెత్తి ఏదో పలుకబోయింది; కానీ అంతలోనే ఆమెకు ఒక సరిక్రొత్త ఊహ స్ఫురించింది. వెంటనే "హేమంత్, ఈ ఆనంద సమయంలో మనం మన గ్లాసులను మార్చుకుందాం" మనం మన ప్రేమను మార్చుకుందాం" అని అంటూ ఉషారాణి అతనిచేతిలో ఉన్న గ్లాసును తీసుకొని తన గ్లాసును అతనికి అందించింది. అతను చెప్పబోయేది కాస్త వినకుండానే, దప్పిక గొన్న ఆమె మరుక్షణంలో ఆ గ్లాసును ఖాళీ చేసింది.

ఆమె గొంతు వెంటనే భగ్గుమంది. అట్టే కాలం గడువక ముందే ఆమెకళ్ళు ఎఱుపుగామారి, నీలంగా అగుపించి. చివరకు పసుపుపచ్చవర్ణంలో మిలమిలా మెరిశాయి. ఆ క్షణంలో తననరాల నెవరో తాళ్ళను లాగుతున్నట్టు లాగి బిఱ్ఱబిగియదీస్తున్నట్టు అనిపించింది. ఆమెకు ప్రేళ్ళు పీక్కు పోతున్నట్టు బాధపడింది. ఏదో వస్తువు తనలోని ఉచ్ఛ్వాస నిశ్వాసాలను అరికట్టుతున్నట్టు ఆమె తపనపడింది, ఆ స్థితిలోకూడ ఆమె ఆలోచించింది. వ్యవధి లేకపోయినా ఆలోచించి "బాబా! ఏమిటీ సాహసం! ఏమి చేశావు?" అని గట్టిగా అరచి నేలమీద పడిపోయింది.

హేమంత్ గుండె గుభేలుమంది. అలలతో ఉప్పొంగుతున్న సముద్రంలో పడ్డ ఈతతెలియని వానివలె, అయోమయ స్థితిలో పడ్డాడు. అతని అంతరంగంలో నిబాధకు అంతులేక పోయింది. జయదేవ్ కోసం చూశాడు; కానీ అప్పటికే జయదేవ్ అక్కడ నుండి

దివినుండి భువికి దిగిన అప్సరసలాగ అగుపించింది. ఆమె ఆ క్షణంలో ఒక పుష్పగుచ్ఛాన్ని అంటిపెట్టుకుని గాలిలోనికెగిరి పోవటానికి రెక్కలు విప్పబోతున్న సీతాకోక చిలుకలా, అచ్చటి అతిథులందరి దృష్టిని ఆకర్షించింది. పార్టీ ముగిశాక రంగు రంగుల దుస్తుల్లో ఉన్న స్త్రీ పురుషులంతా క్రిందిహాలులోనికొచ్చారు. హాలులో చిక్కటి రంగుతో చక్కగా చిత్రితమైన చిత్రాలతో గోడలు శోభాయమానంగా ఉన్నాయి. అక్కడక్కడ ప్రతిష్ఠింపబడ్డ విలువైన శిల్పాలు సౌందర్యాన్ని క్రుమ్మరిస్తున్నాయి. హాలంతా అతిథులతో కిటకిట లాడుతోంది. అనుక్షణమూ విద్యుద్దీపాలు ఆరిపోవటం, వెనువెంటనే వెలగటం, ఇది అచ్చట ఉన్నకొద్ది పిల్లలకు వింతగా అగుపించింది. గోడగడియారం వంక పదేపదే చూస్తూ ప్రతి ఒక్కరూ ఎంతో ఉత్సాహంతో నిరీక్షించ సాగారు.

సరిగ్గా ఎనిమిదిగంటలు కాగానే లైట్లు "ఆఫ్" చెయ్యబడ్డాయి. తెర నెమ్మదిగా తొలగిపోయింది. తెల్లటిచీరెలో ఒక అపురూపమైన ఆకారం స్టేజిమీద కదిలింది. కమ్మని సంగీతం ప్రారంభమై, పరాకాష్ఠనందుకుని, మరల క్రమంగా తగ్గుముఖం పట్టింది. ఆ శ్రావ్య సంగీతం, మైమరపింపచేసే నృత్యాలు, ఆహ్వానితులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తాయి. ఎంతో ఔత్సుకతను ప్రదర్శిస్తూ ప్రతి ఒక్కరూ తమ తమ గుడ్లప్పగించి చూస్తున్నారు. ఒక చిత్రప్రదర్శన శాలలోని చిత్తరువుల్లాగ వారంతా చలనంలేనట్టు కూచున్నారు. ఆమె కదలికల్లో మయూరాలు పురులువిప్పి నాట్యం చేశాయి. గాలికి ఊగిసలాడుతున్న ఆమె ముంగురులు మకరందాస్వాదనకు తహతహలాడుతూ పువ్వు పువ్వునూ పరిశీలించటం కోసం పరుగులు తీసే భ్రమరసమూహాలు స్ఫురణ కొచ్చాయి. ఆమె గొంతు విప్పగానే కోకిలగానం వినిపించినట్లనిపించింది. అందం వివేకం, సౌకుమార్యం మూర్తీభవించిన ఆ స్వరూపం వారినందరినీ ఆ కొద్దిక్షణాల్లో స్తబ్ధులను చేసింది.

ఈశ్వరయ్యా ఆఖరుమారుగ తబలామీద చిన్నదెబ్బ వేయటంతోనే, సంగీతం క్రమంగా "ఫేడౌట్" ఐంది. వీనులకు అతిథుల కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. "భేష్, భేష్, చాలా బాగుంది. అద్భుతం, అమోఘం, వర్ణనాతీతం" మున్నగు ప్రశంసా వాక్యాలు గాలిలో తేలియాడాయి. కొద్ది సెకండ్లు గడిచి నిమిషాలను అందుకున్నాయి. చప్పట్ల సవ్వడి ఇంకా హాలులో అణగిపోలేదు. జయదేవ్ కూడా ఆనందాతిశయంతో చప్పట్లు కొట్టాడు; కానీ అప్పటికే అతని కళ్ళలో నీరునిండాయి. హేమంత్ ఆనందానికి హద్దులేకుండా పొయ్యాయి. అతను జయదేవ్ పరిస్థితిని తిలకించలేదు. సరికదా; జయదేవ్ రాల్చిన ఆనంద బాష్పాలను అంతకంటె చూడలేక పొయ్యాడు. వెంటనే జయదేవ్ లేచి వెళ్ళిపోతున్న అతిథులకు వీడ్కోలు చెప్పటానికి అచ్చటినుండి కదిలిపొయ్యాడు.

ఉషారాణి ఒక్కమారు జయదేవ్ వంక చూచి భక్తిపూర్వకంగా "బాబా" అని అంది. జయదేవ్ ఉషారాణి మూర్ధము స్పృశించాడు. వెంటనే చిన్ననాటి ఉష, ఉషను ప్రేమతో పెంచి పెద్దచేసి ఇంతటి ఉన్నత స్థితికి తీసుకొచ్చిన ఉదంతం, అంతా అతని స్మృతిపథంలో ఒక్కమారు తళుక్కుమన్నాయి. ఆమె తన కళోపాసనలో అత్యంత శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తూ రావటంవల్ల అనతికాలంలోనే ఆమె అసమాన చాకచక్యంతో తారాపథాన్ని అందుకుని తెలుగు తెరమీద ప్రకైక అందాలనాయకి యని అనిపించుకొంది. జయదేవ్ ఆమెను "క్షేమంగా వర్ధిల్లు ఉషా! క్షేమంగా వర్ధిల్లు" అని ఆశీర్వదించాడేకానీ, అతను ద్వారంవద్ద నుండి వెనుదిరిగి వస్తున్న హేమంత్‌ను చూడగానే, అతని హృదయంలో ఉదయం ఏర్పడ్డ ఆవేదన, ఆక్రోశాలు వెల్లుబికి, ఆ కోపతీవ్రత అతని కళ్ళలో ప్రతిఫలించింది. అతని నాసికాపుటాలు చలించాయి. అతని హస్తాలు పిడికిళ్ళను బిగించాయి.

కానీ, వీటన్నిటినీ కప్పివుచ్చి జయదేవ్ స్నేహపూర్వక దృక్కులను ప్రసరిస్తూ హేమంత్‌కు స్వాగత వచనాలు పలికాడు. వెంటనే "ఎవరక్కడ? ద్రాక్షారసం తీసుకురండి." అని హుకుం జారీచేశాడు. "ఇదిగో, ఉషారాణీ, ఇదితీసికో. నీవు బాగా అలసిపోవటమేగాక బాగా దప్పిక గొన్నట్టగుపిస్తున్నావు. ఇదిగో నాయనా హేమంత్, నీవూ స్వీకరించు. ఈ రోజంతా నీవు చాల శ్రమతీసుకున్నావు. బహుశా ఇది నీకు కాస్త ఉపశమనాన్ని కలుగచేయవచ్చు" అని అతనికి కూడ ఒక గ్లాసు అందించాడు. వెంటనే జయదేవ్ ఒక్కమారు చుట్టూ కలయజూచి "అవును నన్నెవ్వరూ చూచివుండరు" తొలిక్షణాల్లో ఆహ్వానితులంతా నృత్యగానాల్లో నిమగ్నులైనపుడు నేను లోనికెళ్ళి ఆ చూర్ణాన్ని తీసి అనుకూలించిన అవకాశాన్ని బట్టి ఎవ్వరూ చూడనప్పుడు హేమంత్‌కు ప్రత్యేకంగా

తప్పుకున్నాడు: అతడు ఆతృతగా ఉషారాణిని పక్క మీదికి చేర్చాడు, టెలిఫోన్ వద్దకు పరుగుతీసి డాక్టరును రమ్మని కబురుచేశాడు; మరలవెళ్ళి "ఉషా !" అంటూ ఉషారాణిని పలుకరించాడు; ఆమెపాదాలు, హస్తాలు తాకిచూశాడు. దేహమంతా చల్లగాఉంది. కళ్ళలోని కనుపాపల చలనం అస్పష్టంగా అగుపిస్తోంది. ఆమెవదనంలో ఆనందం తాండవించటానికి బదులు విషాదం క్రమ్ముకుంది. పెదవులమీద చిరునవ్వుకుబదులు చిన్నగా వొణుకు బయలుదేరింది. నవ్వును ఒలకబోస్తూ, వసంత ఋతువులో వికసించిన ప్రసూనంలాగ కళకళలాడిన ఆమెముఖం, ఇప్పుడు కళావిహీనంగా, తేజోరహితంగా, పేలవంగా మారిపోయింది. ఆమెకురులుకూడ చలనంలేకుండా పడివున్నాయి. ఆమెలోతైనకళ్ళలో నీరునిండి బిందువులు, బిందువులుగా వెలుపలికి వస్తున్నాయి. ఆమెస్థితిని కళ్ళారచూస్తున్న హేమంత్ గుండెతరుక్కుపోయింది. "ఉషారాణీ, ఉషారాణీ ! నా హృదయేశ్వరీ..." అంటూ అతను భోరున విలపించాడు.

"హేమంత్, నాప్రియతమా." ఆమెమెల్లిగా గొణిగింది." హేమంత్, నీవు ఎంతపిచ్చివాడవు? నీహృదయం ఎంతబాధపడింది. ఈ ప్రపంచం చిత్రమైనది. మానవ జీవితాలు మెత్తటి రోజాపూలతో చేయబడ్డ శయ్యలు కావు. అడుగుతీసి అడుగువేస్తే క్రుచ్చి, రక్తాన్ని చిందించే ముళ్ళతో నిండినబాటలు. ప్రమాదాలు, కుట్రలు మనజీవితాలపైకారుమేఘాలవలె క్రమ్ముకొనిచీకట్లను సృష్టిస్తాయి. శీతల మంచును క్రుమ్మరిస్తాయి, జీవితపథంలో మనం మననడకలు సాగించాలి, నేను ఇప్పుడు వెళ్ళిపోతున్నాను. ఎక్కడికో నాకేతెలియదు...జీవిత రంగంలో నాపాత్రపోషణ ఇంతటితో పరిసమాప్తమైంది" "ఎక్కడ? ఎక్కడికెడుతావు ఉషారాణీ? ఎక్కడికెడతావు? నీతోబాటు నన్ను తీసికెళ్ళు. నాఉష లేకుండా నేను ఒక్కక్షణమైనా ఉండలేను."

"నీకుదూరంగా కాదు హేమంత్, కానీ ఈఅశాశ్వత ప్రపంచానికి దూరంగా,"

"ఉషా ! దీనిని ఈ విధంగా అంతంచేయటానికేనా నేను నీ సుకుమార జీవితంలో అడుగుపెట్టింది. నీవు నన్ను బ్రతకమని ఇంకా బ్రతిమాలుతున్నావు. నీవులేని జీవితమా! లేదు, ఉషారాణీ ! లేదు. ఉషారాణి లేకుండా హేమంత్ జీవించలేడు, ప్రమాదాలు, కుట్రలు లేని ఏ దూరతీరాలకో మనంవెళ్ళిపోదాం. ఉషా, మాట్లాడు.నీ మధురకంఠం విప్పి ఎందుకుమాట్లాడవు. నీమధురకంఠం నుండి మకరందాన్ని క్రుమ్మరిస్తానని అంగీకరించావే!.మాట్లాడుమరి. ఉషా, మాట్లాడు. మాట్లాడవేం? "చిన్నపిల్లాడికిమల్లే ఏడ్చాడు హేమంత్.

ఒక్కక్షణంపాటు ఆమె అతనివైపు తదేకంగాచూచింది. ఆసమయంలో ఆమెకళ్ళలో ఉదో ఒకవిధమైన కాంతి మెరపులా మెరసి వెంటనే అదృశ్యమైంది. అంతిమగడియల్లో మృత్యువుతో పోరాటంసల్పుతున్న ఉష హీనస్వరంతో అంది "హేమంత్ ఏడ్వకు. విషాదసంభరితమైన నీశోకాలాపన నాహృదయాన్ని మరింత సంక్షోభపెడుతుంది, నేను నిన్ను విడిచివెళ్ళను. రాణి ఎల్లప్పుడూ నీవద్దనే ఉంటుంది. హేమంత్. నేను నిన్ను మరువను. నేను నిన్ను మనసార ప్రేమించాను. ఎల్లప్పుడూ నిన్నే ప్రేమిస్తాను. ఆకన్నీటిని తుడిచివెయ్యి. ఈశరీరం మట్టితో చేయబడింది. ఇది చివరకు మట్టిలోనే కలసిపోవాలి. కానీ నాఆత్మ నీనుండి స్వర్గాన్ని పొందుతుంది. నీవే నాస్వర్గం. సర్వస్వం, నేను నీఆత్మతోనే కలసిఉంటాను. నీవూ అక్కడికొచ్చాక మనమిరువురం కలసి పరమాత్మగా రూపొందుదాం. విలపించటం ఇంతటితో ఆపు. దానివల్లనీకేమీ ప్రయోజనంలేదు. దుఃఖాశ్రువులు నీకళ్ళనుండి వెలువడటం నేను భరించలేను. నీఉషారాణి అక్కడే ఉంటుంది. ఎక్కడైతే మధుర మంజులగానం.... నేత్రానందకరమైన నృత్యం.... నిండు చంద్రుని వెన్నెల, హేమంత్."

"ఉషా, !" అతను గట్టిగా అరిచాడు, కానీ జవాబేమీ రాలేదు. ఉషారాణి ప్రాణపక్షి అప్పటికే ఎవ్వరికీ అగుపించకుండా రివ్వునఎగిరి అనంతాకాశంలోనికెళ్ళిపోయింది.

---

"ఇడుమగలయప్పు డుపయోగపడునటంచు ధనము నార్జించుకొనియుండఁదగు వివేకి
సన్ననూకలు బియ్యము సంగ్రహించి కన్నమున దాఁచుకొనుగదా సన్నచీమ"

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి

# ముసలమ్మ మరణము

## శ్రీ సాయినాథశాస్త్రి

ఆధునికాంధ్రరచయితగా శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారి నెరుగని యాంధ్రుడుండడను టతిశయోక్తి గానేరదు. శ్రీరెడ్డిగారి జన్మస్థలము చిత్తూరుజిల్లాలోని కట్టమంచి యను గ్రామము. వీరు క్రీ. శ. 1880 నుండి క్రీ. శ. 1951 వఱకు జీవించియుండిరి. పాశ్చాత్యదేశములకు సైతమేగి విద్యాభ్యాసమొనర్చినారు. క్రీ. శ. 1926 సంవత్సరములో స్థాపింపబడిన యాంధ్రవిశ్వవిద్యాలయమునకు ప్రథమఉపాధ్యక్షులైనారు. నిజాము, తిరువాన్కూరు ప్రభువులనుండి సైతము ధనమును సంపాదించి యాంధ్ర విశ్వవిద్యాలయము నభివృద్ధి యొనర్చిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయాభివృద్ధికి వీరొనర్చినకృషి యెంతయు బ్రశంసింపతగినది. శ్రీరామలింగారెడ్డిగారికి క్రీ. శ. 1937 లో "కళాప్రపూర్ణ" బిరుదము నొసంగి యాంధ్రవిశ్వవిద్యాలయము తనకృతజ్ఞతను బ్రకటించుకొనినది. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారి కృషి ఫలితముగనే నేడు విశ్వవిద్యాలయము విశ్వవిఖ్యాతి నార్జించుకొనినదనుటయు తప్పుకాదు.

శ్రీరెడ్డిగారు సర్వతంత్రస్వతంత్రులు, ఆంధ్రాంగ్లములు రెంటియందును నిరర్గళముగా నుపన్యసింపగల మహావక్త. ప్రతిపక్షులెవ్వరైనను సరకుగొనక, తీవ్రముగా సూటిగా విమర్శించెడుస్వభావము వీరిది. తెలుగుసారస్వతోద్యానమున వీరొనర్చినకృషి గణనీయమైయున్నది. వీరు చక్కనికవిత్వము చెప్పగల నేర్పరులు. అందులకు వీరిచే రచింపబడిన "ముసలమ్మమరణమే"సాక్షి! చక్కని విమర్శనాశక్తి గలవారనుటకు నిదర్శనము వీరి "కవిత్వతత్త్వవిచారము"! ఇందు ప్రాచీనాంధ్ర ప్రబంధమండలిని నిష్పాక్షికముగా విమర్శించి ఆంధ్రసాహిత్య విమర్శన చరిత్రకు మార్గదర్శకులైనారు. "ముసలమ్మమరణము" నందు వీరు ప్రదర్శించిన ప్రతిభావిశేషములను దిఙ్మాత్రముగా వివరించుటయే యీవ్యాసమువలని ప్రయోజనము.

క్రీ. శ. 1899 వ సంవత్సరములో చెన్నపురిక్రైస్తవ కళాశాలయొక్క ఆంధ్రభాషాభిరంజనీసమాజపోషకులగు శ్రీసమర్థిరంగయ్యశ్రేష్ఠిగారి ప్రోత్సాహమే యీకావ్యరచనకు కారణమైనది. దీనిలోని యితివృత్తమును బ్రౌన్‌దొరగారిచే ప్రకటింపబడిన 'అనంతపుర చరిత్రము'నుండి గ్రహించినట్లు శ్రీరెడ్డిగారు పేర్కొనినారు.

ఇందలి యితివృత్తము— అనంతపురమునకు సమీపమున బుక్కరాయసముద్రమనెడి యూరుకలదు. ఆయూరియందొక చెరువు గలదు. ఒకపరి పెద్దగాలివాన వచ్చి, యేళ్లును కోళ్లును నేకమైనవి. ఆచెరువుకట్ట తెగిపోవునట్టి వరద వచ్చినది. అదియే తెగిన గ్రామమంతయు నాశముగాకతప్పదు. ప్రజలందరును భయపడి, జాతరలొనర్చి, పోలేరమ్మకు పొంగళ్లు పెట్టిరి. ఆకాశవాణి యాయూరిలోని బసిరెడ్డియొక్క చిన్నకోడలగు ముసలమ్మ బలియైన నాపద తొలగునని చెప్పినది. ముసలమ్మ యనిన గౌరవాభిమానములు గల ప్రజలాందోళనమొందిరి. విషయమెరిగిన ముసలమ్మ మగనియనుజ్ఞగైకొని, యత్తమామల యనుమతి బడసి నిర్భయముగా శరీరత్యాగమొనర్చి యూరివారి యాపద తొలగించినది.

విషయమిసుమంతయేయైనను తద్విషయచిత్రణమున గవిప్రతిభ యడుగడుగున బ్రతిఫలించుచునేయున్నది. ఆంధ్రకావ్యములలో స్త్రీలకు బ్రాధాన్యము గలట్టి కృతులతి సకృత్తు. అట్టివానిలో మున్నెన్నదగిన దీకావ్యము. మన ప్రాచీనులలో పాత్రచిత్రణ విషయమున ప్రతిభాశాలి తిక్కన. తిక్కనమార్గములోననే నడచి యామార్గమును క్షుణ్ణమొనర్చినారు శ్రీరెడ్డిగారు. పాత్రచిత్రణమనగా గొత్తగా పాత్రనుసృజించి, యాపాత్రయొక్క వ్యక్తిత్వమునకు భంగముకలుగకుండ కథాకార్యవశమున పాత్రయొక్కస్వరూపస్వభావములు స్వయంవ్యక్తములగునట్లు జేయుట! అందే కవిప్రతిభ ప్రకటితమగును, అట్టిపాత్రలే సజీవములనదగినవి. ఇందలి ముసలమ్మపాత్ర యట్టిది.

కావ్యమంతయు పూర్వకవుల ధోరణిలోనే నడచినను 'బాణీ' కొత్తది. పూర్వకవిస్తుతిలో వరుసగా తిక్కన, సూరన వేమనలను బేర్కొని వారియెడల గల గౌరవాభిమానముల బ్రకటించుకొనినారు.

ముసలమ్మ బసిరెడ్డియొక్క చిన్నకోడలు. ప్రజలకందరకు నామెయనిన గౌరవప్రపత్తులు మెండు; బీదసాదల నాదరించెడు స్వభావమామెది. ఆమె బలికావలయునని వినినంతనే యూరివారి యుమ్మలిక పువధులు దాటినది.

"మామపైఁగలభక్తియు, నాత్మవిభుని
మీఁదిమక్కువ, మఱఁదులమీఁదికూర్మి,
ప్రజలమీఁది వాత్సల్యంబు, బ్రహ్మకైనఁ
జూపశక్యమే వేఱొక్కసుదతియందు."

అని ముసలమ్మ గుణములు వివరింపబడినవి. అనగా నందరకు తలలోనినాలుకవలె మెలగినదన్నమాట! సృష్టి నొనర్చెడివాడు బ్రహ్మ. అట్టివానికి సైతము ముసలమ్మతో సమానమగు గుణవంతురాలిని జూపుట శక్యముగాదట! అనగా, నట్టిగుణవిశేషములుగల యువతి వేరొకతె యుండుట అసంభవమన్నమాట!

ఆకాశవాణివాక్కులను వినిన ముసలమ్మ మగని ముందు—

లేనగవును గన్నీళ్లను
గా, నెద తటతటయనంగ" నిలచినదట!

ప్రజలనందరను రక్షించుటకై తనజన్మము సార్థకమగుచున్నదిగదా యనెడు సంతసముచే లేనగవు! ప్రాణబంధువులను, వీడిపోవలసివచ్చినదిగదా యనెడు చింతచే గన్నీళ్లను గలిగినవి. భర్త తనకోరిక నంగీకరించునో లేదో యనెడు సందియముచే హృదయము తటతటగొట్టుకొనినదట! చాలచక్కని మనస్తత్త్వ చిత్రణ! భర్త యడుగుటతోడనే తనరాకకు గల కారణము వివరించినది. మొట్టమొదట ఆతడంగీకరింపలేదు. పలువిధముల నర్థించినది. ఎట్టకేలకు విధిలేక యొప్పుకొని—

"తెలియునునాకును నీవ
న్యులఁ బోలవనియును, గొప్పయొప్పిదములకున్
నెలవనియు, నేను నీకుం
జలజానన తగననియును సత్యముగాఁగన్"

అని పలికినాడు. భర్తచే నింతగా బొగడ్తనందిన స్త్రీ నిజముగా ధన్యురాలు. మగనివిషాదము ననునయించుచు—

"చిఱుతనుండి మిమ్ము సేవించుటయ కాని
నోరుతెఱచి యడుగనేర నెద్ది
"యేమియడుగ" వనుచు నెన్నియోమార్లు మీ
రలుకఁగొంటి; రిప్పు డడుగనీరు"

అని కాంతాసమ్మితముగా నచ్చజెప్పి యంగీకారమును బొందినది.

తరువాత అత్తమామలకడకేగినది. ఆమె తమ్ము వదలిపోవునని వినినంతనే వారుపడిన యావేదన మింతింతయని వర్ణింపనలవికాదు—

"కనులులేనిమాకుఁ గన్నును నూఁతకో
లయును నీవ మాతనయులకంటెఁ
గూర్తు మాకు ముద్దుకోడలా! నీవు లే
నట్టియిల్లునిల్లె? యడవిగాక"

యని యనేకరీతుల 'కడుపున గంపెఁడగ్గి పడి గాసియొనర్చిన భంగి' దుఃఖించిరి. భర్తప్రేమను బొందుట స్త్రీలకంతగాఁ గష్టసాధ్యముకాదు. కాని యత్తమామల మన్ననలు లభించుట కలలోనివార్త! ఎంతగుణవతియైనను నెప్పుడో యొకప్పు డత్తమామల యారడి బొందక తప్పదు. తమ కడుపునగన్న కొడుకులకున్న మిన్నయట యామె! "ముద్దుకోడలా!" యని సంబోధించుటయందే వారి యభిమానము వ్యక్తమగుచున్నది. అట్టియత్తమామల ననునయించునప్పటి కామె తలప్రాణము తోకకువచ్చినది.

తనయుని భర్తకప్పగించినది. పరోపకారమునకై పుత్రప్రేమను సైతము త్యాగమొనర్చిన ధీరురాలు. బిడనప్పగించుచు, తనదుఃఖమును గాంచి భర్త దుఃఖించునేమో యని మోము ద్రిప్పుకొనినదట! ఆ యవస్థ వర్ణనాతీతము అటనుండి కదలి ప్రజలయనుమతి బొందినది.

జలకమాడినది. సరస్సువంకకు నడచినది. ఇను డపరాంబుధి కేగునట్టులున్నది.—

"ఉరుహారిద్రపుఁజీర సాంధ్యరుచిగా నొప్పార, నానందవి
స్ఫురితంబైన మొగంబు రక్తమయమై
సూర్యప్రభం బోల, శో
కరసాధీన జనాళి పుల్గులక్రియం గాంక్షన్
మొఱల్ వెట్టఁ, దా
సరసీరాజ మహాబ్ధికై చనియె
విస్ఫారీభవన్మూర్తియై."

పసపురంగుచీర సంధ్యాసమయమందలి రంగువలె నున్నదట. ఆనందోల్లాసముతో మోము రక్తిమదాల్చుటచే ఎఱ్ఱనిసూర్యకాంతివలె నున్నదట. శోకాకులస్వాంతులగు జనుల హాహారవములు పక్షులమొరల వలె నున్నవట. అట్లామె కలతలేని మనసుతో, దరహాసభాసురవదనయై ప్రాణత్యాగమొనర్చి చిరతరమైన కీర్తి నార్జించుకొనినది.

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య" మ్మనెడు నిర్వచనము సత్యమని నిరూపింపగల కావ్యమిది. ఈ గాథకు బహుళప్రచారము గలిగించినది శ్రీరెడ్డిగారే! దీని నొక్కపరి పఠించిన సహృదయులు ముసలమ్మను గాని, తత్పాత్రప్రశస్తికి గారణభూతులైన శ్రీకట్టమంచి

రామలింగారెడ్డిగారినిగాని మరువజాలరను టతిశయోక్తి కాదు.

వ్యాకరణనియమోల్లంఘనము కనుపట్టదు. అట్లని వీర గ్రాంథికభాషకూడ లేదు. చక్కనిపోకడః వీరికవిత్వము తెలుగుపలుకుబడులతో సహజసుందరముగా నుండునే గాని కృత్రిమముగా గనుపట్టదు. వీరుపయోగించిన తెలుగు పలుకుబడులకు "ముల్లుదీసి కొఱ్ఱుడచుట," "పూసగ్రుచ్చుట," "ఇచ్చకంబులాడుట," "ఆకలములుభుజించుట," "ముద్దుచెల్లించుట" మొదలగువానిని నిదర్శనములుగా జూపవచ్చును. సంభాషణలను నడుపుటలో వీరికి పింగళిసూరనార్యుడే గురుపీఠము: మెలకువలన్నియు గురూపదేశములే. సూరనగారి కవితావైభవము నాకళింపునకు దెచ్చుకొని, యతని తత్త్వము నర్థముజేసికొనిన ప్రతిభావంతులలో శ్రీ రెడ్డిగారొకరు.

ముసలమ్మమరణ మొక విషాదాంతేతివృత్తము. ప్రాచీనసంప్రదాయ విరుద్ధమని, చాలమంది మంగళాంతముగా వ్రాయుమని ప్రోత్సహించినను శ్రీ రెడ్డిగారు తమ సంకల్పమును మరల్చుకొనలేదు. మరణాంతములన్నియు మంగళాంతములు గావని యనుకొనరాదు. ఆమరణము లోకకల్యాణార్థమేయైన నది మంగళాంతమే యనవలెను. ఆధునికయుగములో దృశ్యకావ్యములలో మరణాంతములను ప్రవేశపెట్టినకీర్తి శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారికిని శ్రవ్యకావ్యములలోఁ బ్రవేశపెట్టిన కీర్తి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారికిని దక్కినది. శ్రీ రెడ్డిగారి భాషలోని యందచందములు, నైశిత్యమును మరపురానివి.

ఆధునికనాగరకతాప్రభావము వెఱ్ఱితలలు వైచిన నేటి కాలపు స్త్రీలకు సత్ప్రవర్తనాది సుగుణబోధనమున మార్గదర్శకముగా నుండదగిన దీచిరుతకబ్బము. స్త్రీజనోపయోగమునకే యిది రచింపబడినది. అందులకే శ్రీ రెడ్డిగారు ముఖపత్రమున "ఈ చిన్నపొత్తము ముఖ్యముగా స్త్రీల కొఱకుఁ జేయఁబడినది. వారికుపయుక్తముగా నొప్పిన యెడల నాప్రయాస సఫలతనొందినట్లే" నని వ్రాసినారు. వారికోరిక తీరుగాక! 

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

**Statistics for the Month of August, 1961.**

**OUT-PATIENT REGISTER:—**

| | |
|---|---|
| No. of Surgical cases treated | 21 |
| „ „ Medical „ „ | 590 |
| „ „ Ante-natal „ „ | 201 |
| „ „ Post-natal „ „ | 35 |
| „ „ Gyneac „ „ | 101 |
| „ „ E.E.N.T. „ „ | 41 |
| „ „ Dental „ „ | 5 |
| Total „ „ New Patients | 994 |
| „ „ „ Old „ | 1211 |
| Grand Total | 2205 |

**ADMISSION REGISTER:—**

| | |
|---|---|
| No. of Patients admitted for Normal Deliveries | 97 |
| „ „ „ „ „ Abnormal: Perforation-1, Forceps -7, M.P. Placenta -2 | 10 |
| No. of Patients Post Natal Cases treated | 2 |
| „ „ Ante-natal „ Toxeamia | 3 |
| „ „ „ „ False pains | 15 |
| „ „ Gyneac „ | 19 |
| „ „ Surgical Cases | 2 |
| „ „ Medical „ | 12 |
| „ „ Babies admitted as Lodgers | 109 |
| Grand Total | 269 |

(True Copy)

(Sd.) Dr. K. R. AMBUJA,
*Resident Medical Officer.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

Smt. V. LAKSHMI PARVATI.
*Secretary.*

# ఏకం చేసిన లేఖలు

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

నీలా దేవిగారికి.

నీల వినీలగగన మధ్యంలో అలరారే చంద్రబింబంలా నిరాశా పూరితమైన నా హృదయంలో మీ ముఖం వెలుగులు వెదజల్లుతూందన్నది పరమసత్యం. మీ వదనంలోని రమణీయతతో నాహృదయంలో చెలరేగే జ్వాలలో. ఏవో నన్ను మీ ప్రాపు నాశ్రయించమంటున్నాయ్. సలసల మరిగే నా హృదయమనే అగ్నిపర్వతం హిమకరమగు మీ మోమనే చంద్రబింబంనుంచి వెదజల్లబడే చిరునవ్వుల చల్లదదానికి శాంతినిస్తోంది. క్షమించండి. ముక్కూ మొగమూ ఎఱుగని నేను మిమ్ముల నిలాభావించటం తప్పని మీరు తలిస్తే నిస్పృహాతో జీవితమనే ఇసుక ఎడారిలో సొమ్మసిలేవరకు పరుగిడినవాకు, మీతో పరిచయం కల్గించుకోటం అనే విషయం ఒయసిస్‌లా కనపడుతోంది. ఇక మీరర్థం చేసుకోగలరను కుంటా, నేను మిమ్ము ప్రేమిస్తున్నానని!

యవ్వన మదంలో నేనువేసిన తప్పటడుగు కాదనీ, మనస్ఫూర్తిగ మిమ్ములను కాంక్షిస్తున్నాననీ నమ్మటానికి ప్రయత్నించండి; అలా నమ్మలేకపోతే నా ఉత్తరాన్ని నన్నూ మరచిపోండి. మార్గాంతరాలు వెదకి నా హృదయగుండంలో మరింతవ్యధ కల్గించకండి. అనురాగానికి ప్రతిగా అనురాగం అందజేయలేకపోయినా, హాలాహాలం విరజిమ్మబోవద్దని మిమ్మల్ని వేడుకుంటున్నా.

నాకు తెలుసు. మీ రందరిలాగా తొందరపడేవారు కారని. పెదవులుదాటని చిరునవ్వూ, ముఖంలోగంభీరతా మీప్రత్యేకతని. చాటకనేచాటుతున్నై. అవే నాపాలిట జ్ఞాపకాలూ, ఆశలూ. జాబుకి జవాబు వ్రాస్తారని తలుస్తూ...కాలేజీ ఆవరణలో మీరు చూపిన స్నేహపు చూపులు నన్ని ఉత్తరం రాయ ధైర్యం కొలిపాయ్....

చంద్రం.

చంద్రంగారికి,

మీలేఖ చదువుకున్నా. మనసులో ఏదో వ్యధతో బాధపడుతూ రాసేరనుకుంటా. కాని మీరు నన్ను మరీ ఎత్తులకి ఎక్కిస్తున్నారు. నిరాశని పటాపంచలు చేయగలశక్తి నా ముఖంలో ఉందంటే అది నేను నమ్మలేని విషయం. దర్శన మాత్రంగా ఒకరి హృదయంలో వ్యధ తొలగించ గల్గితే అంతకంటే కావలసిందేమిటి? మీ రనుకునే ప్రతిభ నాలో లేదేమో? ముఖంలో గంభీరత వెనుక ఏదేనా చరిత్ర దాగోవచ్చునేమో? నా ముఖం మీకు సేదదీర్చి నట్టే... మీనుంచి నేనూ ... అప్పుడప్పుడు ఊహాలలో విహరిస్తుంటా. వివరించలేని ప్రత్యేకతలు మీ ముఖంలోనూ నాకు కన్పిస్తుంటాయ్. నా పరిచయం ఒయాసిస్‌లాటిదన్నారు. కాని దాని స్థానం ఎక్కడ? అనంతమైన యిసుక పఱ్ఱలలోకదూ ఒయాసిస్‌లుండేది? ఏ బాటసారి శాశ్వతంగా ఒయాసిస్ఎవద్ద కాలం గడపడని నమ్మవచ్చును. ప్రత్యుత్తరం ఆశిస్తూ తొలిరోజులలోనే అనుకున్న మనం ఒకరి కొకరు సన్నిహితుల మవుతామేమోనని!

నీల.

నీల...గారికి,

మీ జవాబు చూచి ఆనందించాను. ఉత్తరం చేజారాక అది ఎలాటి పరిణామాలకి దారితీస్తుందో, అని అల్లాడిపోయిన నాకు మీ జవాబు సేద దీర్చింది. మీ సహాయానికి నా కృతజ్ఞతాభివందనాలు.

మిమ్ముల నేదో ఎత్తుల కెగరేసేనంటారు .... కాని మీరే ఎగిరేరక్కడికి. నాదేముంది? మీరెంత ఎత్తులో ఉన్నారో చెప్పేను. మీ ముఖంలో యితరులకి సేద దీర్చే టట్లుండడం నమ్మలేకుండా ఉన్నారా? మరొకరి విషయం నాకు తెలియదుగానీ. నేను అలా ఫీలయ్యాను; ఆ గంభీరమైన చిరునగవు చూడగానే మనసు జలదరించింది. జలజలలాడే సెలయేరులా, గలగలమనే నవ్వులో ఏం లోతులుంటై? ప్రశాంత ప్రవాహం గంభీరతరమైనట్లు మీ చిరునవ్వులో అలవికాని మహత్తు నిండి ఉందంటాను.

ఒయసిస్‌లు బాటసారి ప్రయాణానికి తాత్కాలిక విశ్రాంతి స్థలాలు ... తాత్కాలికమే ఐనా వాటి అవసరం ఎంతుంది? నిరాశా, నిస్పృహా పూరితమయిన మానవ జీవితాలకు ప్రతిరూపంగా నిల్చిన ఆ యిసుక దిబ్బలలో, వెలుగూ, అశా అనే ఒయాసిస్‌లను సృజింపకపోతే ఏబాటసారి గమ్యం చేరుకోగలడు? వానిని చూచుకొనేగదా ప్రయాణికుడు జవ

సత్త్వాలను కూడగట్టుకొనేది? నేనూ అలాటి బాట సారినే, దాటినన్ని యిసుక ప్రదేశాలను దాటి కొన ఊపిరితో సేదదీర్చే నీటికుంట కోసం ఎదురుచూసే.. మీ గంభీరత వెనుక చరిత్రా, తెలిసికోవాలని కుతూహలంగా ఉంది. చెప్పగలరా? నాలో ఏదో ప్రత్యేకత మీకు కన్పించిందంటే, నాలో నాకు కనపడని ప్రత్యేకతని మీరు కనుక్కున్నారని అనందిస్తున్నాను. మీ ఉత్తరాలు నాకో కొత్త ప్రపంచం చూపెడుతున్నయ్. ఏదో వెలుగు గోచరిస్తూంది. మిమ్మలని ప్రేమించటం మీ రభ్యంతరంగ భావించరుగదూ! ... జవాబుకోసం ఎదురుచూస్తూ

Note రూమ్ ఎడ్రస్‌కి వ్రాయండి. రేపటినుంచి కాలేజీ లేదుగా!

మీ

చంద్రం

చంద్రంగారికి...

మీ లేఖ అందింది. మీ భావోద్వేగం నన్ను ఆశ్చర్యంతో ముంచెత్తిందంటేనమ్మండి. జీవితాన్ని తరచి చూసినట్లు చక్కగా వెల్లడించారు. ఆ సందేశాలే రూపాలు మార్చుకొని మీ ముఖంలో అమిరేయా? అనే అనుమానం కల్గింది. ఆ భావాలే నన్ను మీ గురించి ఆలోచించేటట్లు చేస్తున్నయ్...నా గంభీరత వెనుకటి చరిత్ర తెలిసికోవాలనుందా? .... ఏ చరిత్ర తెలుసుకోటానికేనా అనుకూల కాలమాన పరిస్థితులమరాలికదా? అవసరమయినపుడు నా అంతటనేనే చెబుతాను. మరి మీరూ ఏదో వ్యథతో బాధపడుతున్నారని తెలిపింది మీ ఉత్తరం. ఏమిటది? చెప్పవచ్చు ననుకుంటే చెప్తారుకదూ?....ఇక మీరు నన్ను ప్రేమిస్తూ 'అభ్యంతరమా' అని అడిగారు, దృగ్గోచరంకాని పవిత్ర హృదయాలమధ్య సంబంధం ప్రేమ! ఆ మహత్తరశక్తి నడ్డు పెట్టటానికి ఎవరితరం? నా నుంచి మీరు ప్రేమ కోరినా కోరకపోయినా, మీరు నన్ను ప్రేమించటానికి ఏమీ అడ్డులేదు. ఉండదుకూడా.

నిజంగా నా ఉత్తరాలు కొత్త ప్రపంచం చూపెడితే నేనదృష్టవంతురాలినే, అలా వ్రాయగల్గే శక్తి ఉన్నందుకు. ఆ ప్రపంచాల్లో ప్రవేశించి నన్నుమరచిపోకండేం? అక్కడ నేనుండే హాస్టల్ మూసివేసేరు. ఒక ఫ్రండ్ యింట్లో ఉంటున్నాను. క్రింది ఎడ్రస్‌కి రిజిష్టర్ పోస్ట్‌లోనే జాబులు రాస్తుండండి. లేదా ఎవరేనా మనని అపార్థం చేసుకునేందుకు వీలుండవచ్చు. మరో విషయం. రేపులీలామహల్‌లో "శాంసన్ అండ్ డిలైలా" పిక్చర్‌కి రాకూడదూ? నన్ను పలకరించకండి. పక్కన పద్మ ఉంటుంది. 'ఎందుకో ఆ సంకోచం అనుకోవచ్చు మీరు. తరువాత మీకే తెలుస్తుంది. రేపు రెండో ఆట, సినిమావద్ద ఎదురుచూస్తూ.

నీల.

నీలగారికి,...

ప్రతీ ఉత్తరంతోను మన మధ్య సాన్నిహిత్యం—మరికొన్ని మెట్లెక్కుతూంది. ఆనాడు సినిమావద్ద మీ చూపులు అస్తమానూ నా గురించి ఆలోచిస్తే విసుగుపుడుతుందేమో? మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. అయితే ప్రేమకు నే కల్పించుకున్న అవరోధాలే ఉన్నయ్ .మీ ఉత్తరాలు నాకుసరదాగా ఉంటున్నయ్. నిజంగా మీరు తరచు జ్ఞాపకంవస్తున్నారీ కలవులలో. మీరు నామట్టుకు నాకు చాల గంభీరంగా కన్పిస్తుంటారపుడపుడు. కలవులయిపోవచ్చినయ్. మళ్ళీ మనం యథావిధిగా రోజూ కలుసుకుంటూ ఉండొచ్చు. ఏమైనా ఒక విషయం వాంఛిస్తున్నాను. మన పరిచయాలు వీలయినంత రహస్యముగా ఉంచాలి. రేపు కాలేజి వదలగానే లైబ్రరీకి వస్తారుగా...

ఇట్లు

మీ నీల.

నీల....గారికి....

లైబ్రరీలో కలుసుకున్నందుకు థాంక్సు. మీ పేరు గురించి నిన్న ఎందుకో గంటసేపాలోచించాను. బహు చక్కనిపేరు. నామటుకు నాకు మిమ్మల్ని 'నీలూ' అని పిలవాలనుంది. క్షమిస్తారా?.... నిన్న 'దేవదాసు' నవల చదువుతున్నారా? గతము తలచి వగచేకన్నా సౌఖ్యమే లేదంటారు". సినిమాదేవదాసు ఏమో నాకా నవలచదివితే రెండు మూడురోజు లన్నం సహించేదికాదు. గతం ఒక విధంగా భవిష్యత్తుకూ అవరోధమేకదూ. కొన్ని కొన్ని విషయాలు మరచిపోగల్గితే మానవులెంత అదృష్టవంతులు. కాని లాభం లేదు. ఆ దేవదాను, పార్వతీ, జ్ఞాపకాలతో తమ జీవితమే నాశనం చేసుకొన్నారు....

మీరు మరొక్కసారి ఆ నీలంశారీ, ఎట్టివెల్వెట్ జాకట్టు వేసుకువస్తారూ? చెరపలేని ముద్ర నా హృదయంమీద ముద్రించుకోవాలనుంది. మీరు మీ ఫోటో కూడ ఏదేనా పంపితే కృతజ్ఞుడ్ని.

సాగుతున్న మన స్నేహ ప్రవాహానికంతంటూ ఉండకపోతే ఎంతబాగుండును? కాని విధీ, కాలమూ యిలాటివి ఎవేనా అడ్డుతగుల్తూనే ఉంటై. మరింకో రెండు నెలలున్నై మీకూ నాకూ యీ కాలేజీ వద లేందుకు. నాలో నవ్యోత్సాహం రేకెత్తించాయ్. అవి చూపులనే కంటె తూపులంటె సరేమో? మీ హృదయంలో మంచితనం కొంతకొంతగా నా మీదికి ఉత్తరాలద్వారా ప్రసరింప జేస్తున్నందుకు సంతోషం. మీరూ నన్ను ప్రేమిస్తున్నారనుకో వచ్చునా? లేక నేను పొరబడుతున్నానా? ఈ సెలవులు బహుభారం గా కదులుతున్నై. ఆ పద్మని వదలి మీరే హోటల్ లోనో బసచేస్తే.... మన మిరువురం యీ తీరికలోంచి మాధుర్యం గ్రహిద్దుమేమో ! లేదా పద్మను నన్ను యింట్రడ్యూస్ చేస్తే మనం ముగ్గురం కంపెనీ ఎం జాయ్ చేయవచ్చు గదా ! అస్తమానం గాలిమేడల్లో కాపురమౌతుంది. తలపులలో బడి నన్ను నేనే మరచి పోతున్నా. ఏం చదువుదామన్నా మనసు పోకుండా వుంది (ఒక్క మీ ఉత్తరాలమీదకు మాత్రం పోతుంది) అవి నా పాలిట గాథాలహరులూ, ఊహాజనకాలూ అవుతున్నాయ్, మన కంపెనీ కోసం మీరు యత్నిస్తా రుగదూ ! మరో విషయం .... రేపు సాయంత్రం ... మినర్వాబీచ్ కి వస్తే మనం మరొక్కసారి కలుసుకో వచ్చు. ఏమంటారు? మీ పద్మనికూడ తీసుకురండవస రమయితే. ఐదుగంటల సమయాన, చంద్రుడికోసం సముద్రమూ, మీకోసం నేనూ, ఎదురు చూస్తుంటాం. తప్పక వస్తారుగా?

ఇట్లు,
చంద్రం.

చంద్రంగారికి....

మీ సలహాలు పాటించనందుకు క్షమిస్తారనుకుం టాను. మీరు మగవారు. ఏం చేసినా చెల్లుతుంది. స్నేహితురాలి దగ్గరనుంచి వీడి హోటల్ లో బస చేయటానికి అడదానికి కావలసిన గుండె ధైర్యం నాలో లేదని సిగ్గు పడుతున్నాను. అయినా మనం సినిమాలలోను బీచీలలోను కలుస్తూనే ఉన్నాంగా ! కాలేజీలేకపోయినా నాకుపరీక్షలబాధఅంతగాఉండదు అర్ట్సుకదూ! క్లాసులో విన్నదికొంత. ఏ కొంతరాసినా ప్యాస్ చేస్తారు, మరి మీరు ఇంటర్మీడియట్ అయేక ఏంచేస్తారు? **M.B.B.S.** చదివితే మీ శాంతానికి, గం భీరతకు రాణింపు. పేషంట్సు సుఖపడుతారు. ఈ రెండు నెలలూ బాగుగా చదవండి. భవిష్యత్తు తలు చుకొంటె ఏదో భయం. అయినా ఎదుర్కోకతప్పదు. బాధాకరమయిన విషయం ... మన మధ్య ఉత్తరాల రాకపోకలు బయటవారు పసికట్టారు. పరిణామం మీరూహించుకో గలరనుకుంటా. ఏవో నోట అనలేని వాగుడు. క్షమించండి, మిమ్ములనీకూపంలోకి లాగ. టానికి నేనే కారకుణ్ణి. మీరన్నట్లు నేను మగవాణ్ణి. నా హృదయం కరకుగానే ఉంటుందేమో ! యీ అపవాదులు నన్ను చలింపజేయలేక పోతున్నయ్; గాని మీపట్ల వీటి ప్రభావం ఎలా పరిణమిస్తుందో అని మనసు చివుక్ మంటూంది. రేపటినుంచి కాలేజీకి రావటంలేదు. మీరు నన్ను ఎలా శిక్షించినా అనుభ వించటానికి సంసిద్ధుణ్నే. బహుశా మీరీ పాటికి చాల చింతిస్తూ ఉంటారనుకుంటాను. ఈ ఉత్తరానికి వెంట నే జవాబివ్వండి. లేకపోతే ఆత్రుతతో నిండిపోయిన నాగుండె ఒక్కసారి ఆగిపోతుందేమో !

ఇట్లు,
చంద్రం.

చంద్రంగార్కి....

మీ ఉత్తరం చదివి చాల విచారించేను. ఆ వదం తులు నన్ను ఏమీ బాధించవని తెలుపుటకు సంతోషి స్తున్నా. అపరాధులయితే క్రుంగాలిగాని మన యీ మిథ్యాపవాదాల కెందుకు బాధపడటం? ఈ కూతలకి మీరు చలించకండి. మీరుపడేబాధ తలుచుకొని దానికి నేను కారకురాలినని చాలసేపు దిగులుపడ్డాను. ధైర్యం వహించండి నాలానే. నేనూ రేపట్నుంచి కాలేజీమాని యింటివద్దనే చదువు కుందా మనుకుం టున్నా. అయినా మనం ఆదివారపు మధ్యాహ్నాలు సినిమాలలోనూ, సామాన్య సాయంత్రాలు బీచీల్లోను, గడపవచ్చు. నన్ను మరచిపోక మీరు తప్పక వస్తూం డండి. మనం స్నేహితులం. ఇతరుల ప్రలాపాలకి దిగ జారిపోయేంత బలహీనమయింది మన స్నేహం.

నేను బాగానే చదువుతున్నాను. కాని మీ సలహా మళ్ళీ తిరస్కరించ వలసి వచ్చినందుకు క్షమించండి. బడిపంతులమ్మగా జీవితం గడపాలని మా పెద్దల శాసనం. మీఆశ నిరాశ చేసినందుకు మన్నిస్తారుగా?

మీరన్నట్లు జ్ఞాపకాలు మానవ భవిష్యత్తు మీద అధిక ప్రభావం చూపుతయ్. గతం తలచుకొని భగ్న మయిన ఆ దేవదాసు పార్వతులని చూస్తే నాకూ జాలి !

మన స్నేహానికి రెండు నెలల్లో ఆనకట్టలే వేయలేనే మో ! అనే ఆశ నాలో రేగుతుంది. మీరన్న దుస్తులలో రేపు కాలేజీకి చివరసారిగా వస్తా. మీరూ, ఆ పొడుం

రంగు ప్యాంటు, పసుపుపచ్చనిషర్టుతో దర్శనమిస్తారని ఆశిస్తా జవాబు వ్రాయండి. పరీక్షలైనా మనం ఉత్తరాలు రాసుకునేందుకు తీరిక లేనంతగా చదవగలమా?

నన్ను మీరు "నీలూ" అని పిలిస్తే మరీ సంతోషం. నీళ్ళు చూసినపుడల్లా మీరు నాకు పెట్టిన పేరూ, వెనువెంటనే మీరూ జ్ఞాపకం వస్తూంటారు. మరి అవుతా. అవతల హాస్టలుబెల్ అవుతూంది..... ఇట్లు,

నీలూ.

నీలూ....కి.

ఎదురు చూస్తున్న పరీక్షలు రానేవచ్చాయ్. అస్తమానం పరీక్షల బాధతో బూజుపట్టినబుద్ధికి మనవిహారాలూ, ఉత్తరాలూ సేదదీరుస్తుంటయ్. మీరు బాగా చదివేరనుకుంటా. ఏమైనా యిన్నాళ్ళు ప్రిపరేషన్ హాలిడేస్ కనుక బీచ్‌ల్లోను సినిమాలలోను కలుసుకోగలిగాం. యీవారంరోజులూ ఓపికపడితే తరువాత ఏ చీకూచింతా ఉండదు. పరీక్షలైపోతాయ్. పరీక్షలవగానే మనం విడిపోవలసి వస్తుందని చాలబాధగ ఉంది! కాలంస్థంభించి పోతే, ఎంతబాగుంటుందనే పేరాశ కల్గుతుంది! కడసారి కలయికలో మీకొక రహస్యం వెల్లడిద్దామను కుంటున్నా. మీకూనాకూ పరీక్షలయిపోగానే ఆసాయంత్రం బీచ్‌కి వస్తారుగా. ఆనాడు మీకు నేదాచిన రహస్యం చెప్పుకుంటా.... పరీక్షలగురించి బెంగపడకండి. తప్పక ప్యాసవుతారు. బెంగతో ఆరోగ్యం చెడగొట్టుకొనే అబలలుకారు మీరని నానమ్మకం. వీలుంటె జవాబువ్రాయండి.

ఇట్లు,
చంద్రం.

చంద్రంగార్కి....

మనం విడిపోతామంటే నాకూ బాధగాఉంది! ఈ పరీక్షల్లో అటువంటివన్ని మరచిపోండి. నన్ను త్సాహపరుస్తూ మీరురాసిన ఉత్తరాన్ని పక్కన ఉంచుకుంటున్నాను. ఆప్తులలాగా నామేలుకోరి చెప్పేరు. మీరూ అట్టేబాధపడక, శరీరం గురించి శ్రద్ధ వహించండేం!

ఆనాడు మీనుంచి దాచిన రహస్యం నేడు వెల్లడి చేస్తాను. ఇప్పటికయిన రెండు పరీక్షల్లో బాగానే రాసేను. మీరు బాగా వ్రాసుంటారని తలుస్తాను. ఇక కొద్దిరోజులలో మనం యీబాధలనుంచి తలగడుక్కోవచ్చు. మీఅమూల్యమైన కాలం వృథాచేయటాని కిష్టంలేక యింతటితో ఉత్తరం ఆపివేస్తున్నాను. ఆదివారం సాయంత్రం బీచికి.... మరిచిపోరుగా. యీలోగా మనమధ్య ఉత్తరాలు పయనించలేవనుకుంటా.

ఇట్లు,
నీలా.

ఆదివారం సాయంత్రం. బీచ్‌లో దూరంగా.

"నీలూ! అబ్బ! ఎంతఆలస్యం చేశారండి!

"క్షమించండి. ఆపద్మనుంచి తప్పించుకొందుకింత ఆలస్యం అయింది. ఈరాత్రి రెండోఆట సినిమా అయ్యే వరకు మాకుఫ్రీ... పరీక్షలు బాగారాశారా?"

"ఫరవాలేదు. ప్యాసవోచ్చు. మరి మీరో?"

"నేనూ అంతే. ప్యాసవుతానని నమ్మకం ఉంది."

"మరి మీరు రేపు బయలుదేరతారా యింటికి?"

"అవునండి. మరిమీరు?" నీలకనుల్లో నీలాలు మెరిసాయ్.

"ఎపుడేనా బయలుదేరవచ్చు."... కొన్ని క్షణాలు వారిమధ్య మాటలకు బదులు సముద్రపు హోరు నెలకొంది.

"నీలాదేవిగారూ! ఇది మన తుదికలయికేమో! నేను మిమ్మల్ని మోసంచేసేను. నాగతం మీకుచెప్పకుండా. ఇదిగో క్లుప్తంగా నాచరిత్ర. నన్నుక్షమించండి. చదివేక." అంటూ పావుటావు సైజుకాగితం అందించాడు. నీల చదివింది.

".... అపుడు పద్దెనిమిదేళ్ళు. ఇంటర్ ప్యాసు కాగానే బలవంతంకొద్దీ అత్తయ్యకూతురు పార్వతితో వివాహం చేసేరు. ఆమె పేరిట ఎంతో ఆస్థి ఉండేది. ఒక్క సంవత్సరం మాకాపురం నిరాఘాటంగా సాగిపోయింది. కాని.... ఆమె.... ఒకనాడు హటాత్తుగ మరణించింది. నామనసులో అగ్నిపర్వతాలు చెలరేగేయ్. విరక్తితో ఒకటిరెండు నెలలు తిరిగాను శాంతికోసం. పార్వతికో చెల్లెలుంది. ఆమెపేరు లలిత. అక్క చచ్చిపోయేటప్పటి కామెకు పదేళ్ళు. పార్వతిమీద నేను కనబరచిన అనురాగానికి ప్రతిఫలంగా, నాజీవితంలో ఒకవిషాద ఘట్టం మరపించటానికి యుక్తవయసు రాగానే లలితను నాకిచ్చి పెళ్లి చేసి వారిలక్షుల కధికారి చేస్తామన్నా రత్తయ్యవాళ్లు. లలితను చూస్తే పార్వతి జ్ఞాపకం రాకతప్పదు. అజ్ఞాపకాలతో నేను లలిత లేతజీవితం నాశనంచేస్తానేమో

అని భయం వేసింది. ఆమెతో వివాహం నాకిష్టం లేదు. అయినా యింకా ఆవిషయం వారికి చెప్ప లేదు. మనసులో దిగులు మర్చిపోయేందుకు కాలేజీలో B. A. లో చేరేను. క్రితంసంవత్సరం. ఈసంవత్సరం మిమ్మల్ని చూస్తూంటే నాకు పార్వతిని చూసినట్లుం డేది. మనసులో ఆవేదన ఆపుకోలేక మీకు మొదటి ఉత్తరం రాసేను. ఆశుష్క జీవితంలో మీరు నాకు ప్రసాదించిన మాధుర్యానికి మీకు జీవితాంతం కృత జ్ఞుడిగా ఉంటాను. మిమ్మల్ని చేసిన మోసానికి నన్ను క్షమించగలరా?"

"అవ్యధలేనా మీభావాల గంభీరతకు కారణం. మీరేమి చేయరాని మోసం చేయలేదు. అయినా మీరు లలిత నెందుకు చేసుకోకూడదూ?"

"చెప్పేనుగా జ్ఞాపకం వచ్చేగతం ఆమె సుఖాల కాటంకం గల్గిస్తుందని."

"మరి నన్నుచూస్తే మీకు గుర్తుకు రావటంలా?"

"అపుడపుడు గుర్తుకు వచ్చినా, మీఉత్తరాలను చూసినా, మిమ్మల్ని చూసినా క్రమంగా పార్వతిని మరిచిపోగలననే ధైర్యం కల్గుతూంది అనుభవాలనం తరం. అన్నట్లు మీగురించి ఏమిటి?"

"చంద్రం! నేనొక దురదృష్టవంతురాల్ని. నాకథ నోటచెప్పలేక.... అంటూ ఒకకాగిత మందించింది. మెల్లగా విప్పిచూసేడు.

"....దొరకిన మంచిసంబంధం ఎక్కడ చేజారి పోతుందోఅని, ప్రపంచంఅంటే తెలియని పసివయ సులో ఒకజమీందారు బిడ్డకు నన్నుయిచ్చి వివాహం చేసారు. ఆయనని నేను సరిగా చూసేనోలేదో?... కాలంకర్మంగాలి ఆయన ప్రమాదవశాత్తు యీలోకం వీడిపోయారు. జమీందారు పెద్దవారు! ఆస్తంతా నాపేరన రాసినా, యీవయసులో నేను పెడదారి వేయకుండా, మరొక వివాహం నేను చేసుకొనేటట్ల యితే ఆస్తిమీద నాకేహక్కు ఉండదని వీలునామా రాసి దానితో నాకోర్కెలు బంధిద్దామనుకున్నారు. కాని మిమ్మల్నిచూసేక, ఎందుకో....,మీపరిచయం కల్గేక నాలో వింతవింత భావా లుదయించినయ్! అయినా నాకింకసుఖంలేదు! విధవగా భారతదేశంలో బ్రదికేకంటే వురిపోసుకుంటే మేలు. నావిచారం పోగొట్టుకుందుకూ, మనసుకి తీరిక కల్గించకుండా ఉండేందుకు నన్ను మేష్టరమ్మ అవటానికి చదువుకో మన్నారు. పద్మనాన్నగారిని నన్నుచూడవలసిందిగా కోరేరు. మీవాళ్లు. ఆయనకు మనపరిచయం తెలి యదు. క్షమించండి, మిమ్మల్ని మోసంచేసి అనవసరంగ ఆశలురేపి నిరాశలు చేసినందుకు చంద్రం ఆశ్చర్య పోయాడు. ఆమెవిధవ! కాని ఆమాట చెబితేగాని ఎవరూ తెలిసికోలేరు. ఆమెని ప్రేమించేడు! ఆమెనే వివాహం చేసికొంటే! గిరీశం, కందుకూరి వీరేశ లింగం లాంటి సంఘసంస్కర్తలు కళ్లముందు ఏదో సందేశం యిస్తూన్నట్లు భ్రమించాడు. తానామెను రిజస్టరుమేరేజ్ చేసుకోగా తనని సంస్కారనీ, సాహ సనీ అందరూ పొగడుతున్నట్లు ఏదోదృశ్యం కళ్ల ముందు కదిలింది.

"అయితే నీలాదేవీ! మీరునన్ను ప్రేమిస్తున్నారా? నాకోసం మీరు మీసర్వస్వం వదలుకొందుకు సిద్ధ మేనా?" తెగించి ఒకనిశ్చయానికి వచ్చేశాడతడు.

"ఏమిటి మీరనేది? మిమ్మల్ని ప్రేమించేను. కాని విధవనైననన్ను మీరుమోసపోయి ప్రేమించేరు. అం దుకే నాకు బాధకల్గి మీ క్షమాపణ కోరుకున్నా!" ఆమెకంఠం బొంగురుపోయింది.

"గతంమరచి పోలేవా నీలూ? మీవాళ్లనీ, ఆజమీం దారీని వదలి నాతోరాగలవా?" ఆవేశంగా అడి గాడుచంద్రం తనధోరణిలో.

"అంటే మీరు లలితనుమాని.... మరి మీకపుడు ఏం మిగులుతుంది యీ విధవ..." నీలూ కళ్లలోంచి నీలాలుకారుతూ ఎదుట సముద్రంలో కలుద్దా మను కుంటున్నా, యిసుకమాత్రం కర్కశంగా వాటిని పీల్చి పారేస్తూంది. ఆశనిరాశలమధ్య ఆమెహృదయం ఊగు తుంది.

"నాకుఆస్తీ, లలితవద్దు. మీరునేను ఒకరకం వాళ్లమే. మనకలయిక ఉభయులకు సంతోషప్రద మైంది. నన్నురిజిష్టర్ మేరేజి చేసుకొనేందుకు మీకు"

"అంతఅదృష్టమానాకు! ఎంతమంచివారు మీరు!" అంటూ నీలూ చంద్రంని కౌగలించుకొంది. ఎదురుగ సముద్రుడు సిగ్గులేకుండా పొంగిపోయాడు ఆదృశ్యం చూసి.

తరువాత చెప్పేందు కేముంటుంది? పరీక్షలయాక, ఏదో విహారయాత్రలకు వెళ్లాలనీ చెరోమూడు వేలు తెప్పించుకొని ఇద్దరు ముగ్గురు నమ్మకమయిన మిత్రులసమక్షంలో రిజిష్ట్రారుగారిచే ఆశీర్వదింపబడి

గతుకుల జీవితానికి స్వస్తిచెప్పి ప్రేమమయ జీవనానికి నాంది వేయటానికి ఆ రాత్రిబండిలో తమ నెవరు గుర్తించలేని దూరానికి పయనమయారు.

లతులఆస్తి పోగొట్టుకునే వెఱ్ఱిపని చేశాడు చంద్రం అనుకున్నారు చంద్రం తాలూకువాళ్లు.

వయసుపన్నిన మోసానికి లొంగిపోయి వంశ ప్రతిష్ఠలు నాశనంచేసింధన్నా రామెకుటుంబంవాళ్లు.

కాలేజీలో ఛాలమంది మళ్లా ముక్కుమీద వేలే సుకున్నారు.

ఎంద రెలాఅయినా, నీలాచంద్రులు మాత్రం తమ లేఖలతోసహా హాయిగా కాపురం సాగించేరు.

[మీరు ఇలాటికాలేజీ యువతీ యువకుల ప్రేమలు వ్రాయటం కంటె, మహిళాభ్యుదయ కర్తవ్యాల్ని గూర్చి స్త్రీల కుపకరించే వ్యాసాలు దయచేసి వ్రాయ పూనుకోటం మంచిదని మాసలహా. సం॥] ★

# స్త్రీవిద్య: దాని ప్రాధాన్యము

బాలబాలికలకు విద్యలోఉండే తేడా (హెచ్చుతగ్గులు) సరిచేయటానికి ప్రభుత్వం సరిఅయినచర్యలు తీసికొన లేదని శ్రీమతి రేణూచక్రవర్తి 5-9-61 న లోకసభలో విమర్శించింది. కాంగ్రెసుపక్ష స్త్రీసభ్యురాండ్రుకూడా ఈ విషయంలో శ్రీమతి- చక్రవర్తి ఊహల్ని బలపరిచారు. కమ్యూనిస్టుపార్టీ సభ్యుడయిన శ్రీ- టి. బి. విఠలరావు "ఆంధ్రప్రదేశ్‌లో స్త్రీలకు ప్రభుత్వం ఉపాధ్యాయినీ ఉద్యోగాలిచ్చినా, వారు సమ్మతించకపోవటానికి కారణం ఏ"మని ప్రశ్నించారు.

పైసభ్యులకు సమాధానం ఇస్తూ శ్రీ శ్రీమాలిగారు- "మూడవప్రణాళికలో ప్లానింగుకమీషనువారు విద్యావ్యాప్తికోసం కేటాయించినమొత్తంలో నూటికి 43 వంతున బాలికలవిద్యాభివృద్ధికయి వెచ్చపెట్టాలి" అని- సూచించినట్లున్నూ. ఇదిగాక 11 కోట్లరూపాయలు గ్రామాల్లో సహవిద్యాసంస్థలలో పనిచేసే ఉపాధ్యాయినులకు వసతిగృహ సౌకర్యాలు మొదలయినవి సమకూర్చటానికీ- అలవెన్సులక్రింద ప్రోత్సాహంకలిగించటానికీ కేటాయించినట్లున్నూ తెలిపారు.

ప్రభుత్వం ఆశించినంతగా స్త్రీవిద్య అభివృద్ధికి రాని మాట నిజమే అనిన్నీ, అయితే అది ఆర్థికసహాయలోపం వల్లకాదనిన్నీ, సాంఘికంగాను, కుటుంబాల చాలిచాలని పరిస్థితులమూలంగాను ఏర్పడ్డవనిన్నీ, మంత్రిగారు చెప్పారు. పైకారణాలనుబట్టి ప్రకృతం స్త్రీవిద్యకు చాలినంత ద్రవ్యోపపత్తి లభించేమార్గం ప్రభుత్వంచేసింది. స్త్రీవిద్య ప్రస్తుతఆర్థికస్థితిని ఆధారంచేసుకొని- ముందు ముందు ఎంతవరకు అభివృద్ధికి రాగలుగుతుందో ఆవిషయాన్ని గమనిస్తూ, కావలసినయెడల ఇప్పుడు కేటాయించి వుంచిన మొత్తంలోనే, తగినసర్దుబాటు చేయటానికి అనుకూలాలు కలిగిస్తామని ప్లానింగుకమీషనువారు నొక్కి- చెప్పారనిన్నీ, అందుచేత, శ్రీమతి చక్రవర్తిగారు దురభిప్రాయపడటానికి అవకాశం లేదనిన్నీ శ్రీ శ్రీమాలిగారు చెబుతూ, ఈమెలాగే ఇదివరకు శ్రీమతి దేశముఖుగారు కూడా అపోహపడగా, తానాఅపోహ తొలగిపోయేటట్లు నచ్చజెప్పాననీ అన్నారు.

స్త్రీవిద్యాభ్యుదయవిషయంలో కేంద్రరాష్ట్రప్రభుత్వాలపూచీ (జవాబుదారీతనం) ఎంతవరకు ఉండాలి, అనేసందర్భాన్ని చక్కగా ఆలోచించి కొన్ని అవధులనుఏర్పఱచి, వాటిని సక్రమంగా విస్పష్టంగా ప్లానింగు కమీషనువారు నిరూపించారు. కనుక మొదటిపూచీ సాధారణంగా వహించవలసినవి ఆయారాష్ట్రప్రభుత్వాలే. కనుక స్త్రీఉపాధ్యాయినులను ప్రోత్సహించటానికి కేటాయింపబడినమొత్తం 11 కోట్లరూపాయలు సముచితంగా ఉపయోగించే అధికారంపూర్తిగా రాష్ట్రప్రభుత్వాలమీదే వుంటుంది. మూడవప్రణాళికలో స్త్రీలవిద్యకు మిక్కిలి యెక్కువప్రాధాన్యం ఇవ్వబడింది గనుక, విమర్శించేసభ్యురాంద్ర అపోహాలకు ఎంతమాత్రం ఆధారంలేదని నేను దృఢంగా చెప్పగలను. మూడవప్రణాళికప్రకారం విద్యనభ్యసించే బాలబాలికల సంఖ్య 203.9 లక్షలు, అందులో 103.3 లక్షలమంది బాలికలు. అనగా నూటికి 50 మందికి పైగా చదువుకోగలరు.

ఈ మూడవప్రణాళిక ముగిసేలోపల అందరికి ఉచిత ప్రాథమికవిద్య లభించేటట్లు చేయాల్నని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఈ సందర్భంలో ద్రవ్యోపపత్తులనుగూర్చి ఆలోచించరాదని ప్రభుత్వం స్థిరనిశ్చయం చేసుకొన్నది. అయితే- ఇందుకై ప్రజాప్రబోధం ఎక్కువగా కావలసివున్నది. తద్విధంగా విద్యాభిలాష రేకెత్తినప్పుడు, ప్రభుత్వప్రయత్నాలు సఫలమవుతాయి.

ఇంతకుముందు చెప్పినట్లు గ్రామాదులలో వసతిగృహ సౌకర్యాలు, నిత్యజీవితాలకు లోపంలేని విధంగా అలవెన్సులు మొదలగునవి అక్కడ పనిచేసే ఉపాధ్యాయినులకు అందరికి తగినట్లు లభించగల పథకాలను తయారు చేయటంలో ప్రభుత్వం ఏమాత్రం వెనుకంజ వేయదని చాటిచెబుతున్నాను.—— అని మంత్రిగారన్నారు.

('హిందూ' 6-9-61)

# పరివర్తనల - నాటిక

## శ్రీ నిడదవోలు పెదసూర్యనారాయణ

సుజాత కాలేజివిద్యార్థిని. పంకజం క్లాస్‌మేట్.

పంకజ : అదేమిటే ఎప్పుడొచ్చినా ఏదోపుస్తకం పట్టుకొని చదువుతూనేవుంటావు. Social Studies సైకాలజీ అంటే అభిమానమని ఒప్పుకున్నాను, కాని సొసయిటీస్‌తో ఫ్రీగా మువ్‌కాకపోతే రెండూ బోధ పడవు. ఎన్నిసార్లు చెప్పినా వినవు. నీతో నాకు బెడ నగావుందే?

సుజాత : (కోపంగా) ఆడమొగవిచక్షణలేక సంఘంలో కలిసిమెలిసి అలసిపోతేనేగాని బోధపడవని నీవుద్దేశం; అంతేగా. సోషల్‌స్టడీస్ అంటే ఎవరైనా ఆపదలోవున్నప్పుడు మనశక్తి వంచన లేకుండా వెళ్లి సహాయంచెయ్యడం, సైకాలజీ అంటే తనకు మిత్రులెవరో శత్రువులెవరో తెలుసుకొని ప్రవర్తించడం, వీనికి ప్రత్యేకశ్రద్ధ అవుసరంగాని తిరగడం అక్కరలేమ. 'ఆడది తిరిగి చెడ్డది. మగాడు తిరక్క-చెడ్డాడు' అని అనుభవంగలవారు చెప్పింది వినలేదా?

పంకజం : ఎప్పటికాలం మాటలవి. ఇప్పటిలోలాగ దేశంలో అలా అభివృద్ధిచెందాలి. తిండి బట్ట అందుబాటులో వుండేవిధానం విద్యావిధానంలో మార్పులు ఎలాజరగాలి మొదలైన సమస్యలు అప్పటిలోలేవు. అదిసరేగాని, నువ్వు యింట్లో ఒంటరిగా కూర్చుని ఎంత స్పెషల్ స్టడీచేసినా Friend వచ్చినపుడు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కొంతవరకైనా కాలక్షేపం చెయ్యవచ్చును కద; 'ఐతింక్ దిక్రియేషన్ ఈజ్‌ఫర్ దిక్రియేషన్'.

సుజాత: ప్రస్తుతంలో కులాసామాటలు సినిమాసంగతులే కద. వాడిలాగ, వీడిలాగ, అది అలాగ ఇదిఇలాగ, ఆ పిక్చరు అలాగ ఈపిక్చరు యిలాగ, అని వాదోపవాదాలు పెరిగి ఆఖరికి హస్కు-పోయి రిస్కు-లో పడ్డం అంతేగా.

పంకజం: ఎన్నోలక్షలు ఖర్చుపెట్టి అన్నిపక్షాలవారూ ఆమోదించేవిధంగా పిక్చరు తీసి పబ్లిక్‌ఎడ్యుకేషన్ కలుగజేస్తూవుంటే సెన్సులేకుండా మాట్లాడతావేమిటి? పిక్చరు చూడ్డమే ఎడ్యుకేషన్.

సు : నేను కాదనలేదు. Ten Commandments పిక్చరు నాకు నచ్చింది.

(సుజాతక్లాస్‌మేట్ మోహనరావు ప్రవేశం.)

మోహన్ : హల్లో పంకజం, నువ్వు యిక్కడే వున్నావూ?

పం : వుండకూడదా?

మో : కూడదని ఎవరన్నారు.

పం : నువ్వు అనుకుంటున్నావేమోనని నేననుకుంటున్నాను.

మో : అటువంటిమాటలు నావంటికి అంటవు.

పం : అయితే యిప్పుడొచ్చిన తంటా ఏమిటి?

మో : నన్ను చూచేసరికి ఎందుకో కంటసం?

పం : నీకా? నాకా?

సు : మాటలు జోరైపోతున్నాయి ఆగండి. ఇద్దరికీ ఎప్పుడు సవతికయ్యం. ఒకరితత్త్వం మారలేదు.

మోహన్ : నీవువచ్చినపని?

మో : ఫస్టుక్లాసులో వచ్చేవని Congratulate చేద్దామని వచ్చేను. డిగ్రీతో ఆపుచేస్తావా లేక ఫర్‌దర్ ప్రవోజలున్స ఆలోచిస్తున్నావా?

సు : ఏంచేస్తానో చూస్తావుగా.

మో : కొంపతీసి కిరస్తానంలో కలుస్తావా ఏమిటి? Ten Commandments పిక్చరు చూచిన దగ్గరనుంచి నీధోరణి అదోవిధంగా వుంది.

పం : అదంతా నీకనవసరం. క్లాస్‌మేట్‌నికదా అని Free గా మాట్లాడితే Freedom కలుగజేసుకొని యిష్టం వచ్చినట్టు మాట్లాడతావేమిటి?

పం : అతను అన్నదాన్లో అంతగా Feel అవ్వాలసిన దేముందే? ఇద్దరికీ కొత్తకాదుగా.

మో : బాగా చెప్పేవుపంకజం. టంకంపొడిలాగ అంటుకుంది నీమాట. సుజాతకి కోపం ముక్కు-మీద వుంది. అయినా ప్రథమకోపం గలవారికి మనసు నిర్మలంగా వుంటుందిట. కోపంలోకూడ ఎంతో అందంగా వుంటుంది.

సు : నేను చెప్పేనుగా పంకజం. ఇంత కావ్యాలు, ప్రబంధాలు, సంబంధాలు, బాంధవ్యాలు, ప్రణయాలు, ప్రతిబంధకాలు అలాగ జిలిబిలిపలుకులకి అడ్డూఅపూ వుండదు.

మో : సరేగాని యివాళ సరదాగా సినీమాకి వెడ

దాం. నేను రేపు వూరికిపోవాలి.

Extremely Sorry.

మో : సరే వెళతాను.

పం : నీBehaviour నాకేం నచ్చలేదుసుమా! నేడో రేపో Marriage అయితే ఏంచేస్తావు? వాళ్ల ఆధీనంలో వుండవలసిందేకద. స్వతంత్రంగా ఎన్నోలక్షలు ఆర్జించిన లలిత అంటే సినీమాస్టార్. పెళ్లయినతరువాత ఇంకా పిక్చర్లలో ఆక్టుచేస్తావా అని ప్రశ్నిస్తే మావారి యిష్టం అంది. తెలుసా?

సు : నిజమేకాని యిది కోఎడ్యుకేషన్‌వల్ల వచ్చిన ప్రమాదం. కొన్ని Colleges లో అంతా ఆడవాళ్లే గనుక వాళ్లకి యిటువంటి సంఘటనలు తటస్తించవు.

పం: అయితే మనకి మార్గంలేదా?

సు : లేకపోవడమేమిటి. దుర్గాబాయమ్మలాగ జీవితం దేశసేవకై వినియోగించి అప్పటికీ అవుసరమైతే పెళ్లిచేసుకోవచ్చు.

పం : ఏజాతిఅయినా సరే.

సు : ఉన్నతభావంలో జాతిమత భేదాలు లేవు. దుర్గాభాయిగారికి వచ్చిన అగౌరవం ఏమిటి? రాజగోపాలాచారిగారి మర్యాదకు తక్కువైందా?

(సుజాతతల్లి ఆశాదేవి ప్రవేశం)

ఆశాదేవి : ఏమిటర్రా! చదువులు చాలించి రాజకీయాల్లో పడ్డారు.

పం : Marriage అయితే Freedom వుండదు కదా, యని సుజాత దేశసేవకై తనజీవితం వినియోగిస్తుందట.

ఆ : (ఉద్రేకంతో) అవే అవే అర్థం లేని మాటలు. నేను బి.ఏ. పాసైనాను. 20సంవత్సరాలై కాపురంచేస్తున్నాను. నాకిష్టమైనవస్తువులు చేయించుకున్నాను. బట్టలు కొనుక్కున్నాను. ఎన్నడూ నాకు ఆయన అభ్యంతరం చెప్పలేదు. సినీమాకి సరదాగా కలిసివెళ్లేవారం. ఆయనకి కోపంవచ్చేపని నేనెన్నడూ చెయ్యలేదు. నాకిష్టంలేనిపని ఆయనచెయ్యలేదు. ఆదాయంబట్టి ఖర్చు వెచ్చాలు చూచుకునేవారం; కాని ఆర్భాటాలకి వెళ్లేవారంకాము. పెళ్లయి నాకు స్వాతంత్ర్యం వున్నట్టా లేనట్టా. స్త్రీస్వాతంత్రం అంటే ఎలావుండాలో నాకర్థం కాలేదు.

పం : మీరు Foreign వెళ్లేరుకదా! అక్కడంతా ఎంత Free గా Move అవుతారో చూసేవుంటారు.

ఆ : (మహాకోపంగా) ఆ Freedom నేనెరగందికాదు. ఒకణ్ణి పెళ్లిచేసుకోడం కోపంవచ్చి, యింకొకడిదగ్గరకి వెళ్లడం, అక్కడ పాతఅవగానే మరొకడు. ఆ, ఇక్కడ అలా అమలుచేస్తే సంఘంలో చాలానీచంగా చూస్తారు. రాజకీయాల్లోకి ముందంజవేసి పైదేశఆచార వ్యవహారాలు అర్థంచేసుకొని స్వతంత్రభావాలు కలిగిన సరోజినీదేవి, విజయలక్ష్మి పండిట్ తిరిగి వివాహం చేసుకున్నారా? చేసుకున్నా వాళ్లని అడ్డు పెట్టేవారున్నారా? జుట్టు క్రాపుచేయించుకొని గౌన్లు తొడుక్కొని సిగరెట్ కాలిస్తే అడిగేవారున్నారా? ఎందుకు వాళ్లు అలా చెయ్యలేదో గ్రహించేరా?

పం : అయితే పరభాషలు నేర్చుకోకూడదా?

ఆ : కూడదని ఎవరన్నారు? మనభారతదేశం ఆదినుంచీ దాంపత్యధర్మానికి పాతివ్రత్యానికి పేరుపొందింది. సావిత్రి, సీత, దమయంతి, చంద్రమతి మొదలైనవారు భర్తలతో అష్టకష్టాలు పడ్డారు; కాని ధనవంతులైన పుట్టింటికి వెళ్లలేదు. అంతెందుకు? మనకళ్లఎదుట కస్తూరిబాయి రామకృష్ణపరమహంసభార్య శారదాదేవి గార్ల ఆదర్శజీవితాలు చూచేవున్నాం. సుమతి అనేస్త్రీ తన భర్త ప్రాణంకోసం సూర్యగమనాన్ని అరికట్టింది. అనసూయ త్రిమూర్తులను పసిపిల్లలను చేసింది. దమయంతి బోయవాణ్ణి భస్మంచేసింది. మీరాబాయి సక్కూబాయి మొదలైన భక్తురాండ్రు యిక్కడ జన్మించినవారే. తరిగొండ వెంకమాంబ, మొల్ల, పసుపులేటిరంగాజమ్మ, ముద్దుపళని మొదలైన కవయిత్రులు భారతదేశంవారే, ప్రతాపానికి ఝాన్సీరాణీ, ప్రజ్ఞకి అనసూయ ఆదర్శప్రాయులైవున్నారు. ఇంతశక్తివంతురాండ్రైన స్త్రీలకు స్వతంత్రత లేదని ఎవరనగలరు? జాతిచెడిపినా వృద్ధిచేసినా స్త్రీదే బాధ్యత. మనలో ఎంతవిలువ లేకపోతే దంపతులపేర్లముందు మనపేర్లు ఎందుకువస్తుందో ఆలోచించండి. పార్వతీపరమేశ్వరులు- సీతారాములు- రాధాకృష్ణులు మొదలైనవి. అందుచేత మనం ఆదర్శంగా జీవితం గడపడానికి ప్రయత్నించాలి.

సు : ఆదర్శం అంటే నీఅభిప్రాయం.

ఆ : నీకిష్టమైన Subject లో నిరంతరం కృషిచేస్తూ నీఅనుభవాన్ని దేశానికి వెల్లడిచేస్తూ వుండడం. అవతారపురుషులే దంపతులైనపుడు మానవమాత్రులం లెక్కా? సుజాతా. నీకు జ్ఞానంవచ్చినదగ్గరనుంచి మోహనరావు నీతో సమానంగా చదువుతున్నాడు. అతని

గుణగణాలగురించి నాతో చెబుతూవుండేదానివి. ఎప్పుడూ క్లాసులో ఫస్టునీది. సెకండుఅతనిది. ఇప్పుడు డిగ్రీలో కూడా ఫస్టుక్లాసునీది. సెకండు అతనిది. ఆదినుంచీ ఆడదానిపేరే ముందువస్తోంది. ఈజోడూ కుదిరింది. వివాహమాడి ఆదర్శదంపతులై వర్ధిల్లాలని నాకోరిక.

సు : నీవుపన్యాసం నన్ను పూర్తిగా మార్చి నాలో పరివర్తనం కలిగించింది. నీయిష్టమే నాయిష్టం.

పం : అతను వూరికి వెళ్లాడుకాబోలు.

ఆ : ఆగమని చెప్పేను. పక్కనే వున్నాడు. మోహన్‌రావు మొహమాటమెందుకు? ఇలారా. ముందు గాంధర్వం కానిస్తాను. అని (ఇద్దరిమెళ్లో పూలదండలు వేసి) సుజాతా మోహనులు వర్ధిల్లాలి. అని అంటూండగా మంగళవాద్యాలు.

---

# ప్రణయవిలాసం

## చక్రపాణి నరసింహారావు

[బృందావనం-ఏకాంత సమయం-తెల్లని యిసుక పాలవెన్నెల-ఆవెన్నెల్లో జగదేకసుందరిరాధ-ఆమధుర మనోహరమూర్తికన్నుల్లో శ్రీకృష్ణునిరూపప్రతిబింబం! ఆ ప్రణయదేవతల ప్రేమానురాగ సుధాబిందువులే-ఈ "ప్రణయవిలాసం"]

అదిగదిగో
అల్లదిగో.

చల్లని చూపుల
నల్లని రూపం
అందము చిందే
అమృతపు కలశం!

బృందావనిలో
చంద్రుని కిరణాల్
మోహన మురళీ
గానవినోదం!

అదిగదిగో-అల్లదిగో!

ఆకాశములో
తారల పయనం
విపంచి రాగం
సురభి పరాగం!

మేఘమాలికల
గాలివిహారం
మెల్లన వీచే
మలయసమీరం

అదిగదిగో-అల్లదిగో!

చల్లనిచూపుల
సుందరరూపం
మదిలోపొంగే
ప్రేమతరంగం,

చెంతకు చేరిన
చెలి దరహాసం
మదిలో మెదిలే
మంజుల భావం

అదిగదిగో-అల్లదిగో

వలపులుకురిసే
పెదవులరాగం
ప్రేమలుపొంగే
మధురానందం

మంజులమురళీ
మోహనగానం
రాధాకృష్ణుల
రాగవిలాసం,

అదిగదిగో-అల్లదిగో.

వైజ్ఞానిక ప్రగతి:

# ఎద్దులులేని నాగలి: రైతులేని వ్యవసాయం

వెనకటికెప్పుడో శ్రీనాథమహాకవి తనకి అత్తాకోడలు కూడా ప్రసన్నమయారని పోతనకి ప్రదర్శించడం కోసం, తాను ప్రయాణంచేస్తున్న పల్లకీముందుకొమ్ము బోయీలని తప్పుకోమన్నాడట. అదిచూసి పోతన తన నాగలియెడ్లలో ఒకదానిని విప్పివేశాడట. శ్రీనాథుడు రెండవకొమ్ముబోయీలని వదిలివేయమంటే పోతన రెండవఎద్దునికూడా వదలివేసినా నాగలి పనిచేసిందట. ఈ మధ్యనే పశ్చిమజర్మనీలో వ్యవసాయపరికరాలు తయారుచేసే కంపెనీఒకటి దూరాన్నెక్కడో భూస్వామి కూర్చుని మీటలునొక్కుతోంటే, దానంతట అదే భూమి దున్నే ఒకట్రాక్టరుని ప్రదర్శించినప్పుడు ఆకథ జ్ఞాపకం వచ్చింది.

మనదేశంలో ఆహారసమస్య పరిష్కారంకావాలంటే ఆధునికవ్యవసాయపద్ధతులూ, వ్యవసాయపరికరాలు అవసరమని ప్రధానమంత్రి శ్రీనెహ్రూదగ్గరనుంచి గ్రామసేవక్‌వరకూ పదేపదే పాడుతున్నపాటే. ఇతోధికఉత్పత్తికి కావల్సిన పరికరాలూ, కొత్తరకంనాగళ్ళు, ట్రాక్టర్లు తయారవుతున్నాయికూడా. అయినా ఎలక్ట్రానిక్స్‌సహాయంతో చోదకుని అవసరంలేకుండా భూస్వామి ఒక్కడూ తనపొలంలో ఏదో ఒకమూలకూర్చుని ట్రాక్టర్లు యితరపరికరాలసహాయంతో పరాపేక్షలేకుండా, భూమిదున్నుకుని, గింజలుజల్లి పంటకోసుకునే రోజులు ఎప్పుడువస్తాయా? అని ఆలోచిస్తే అది యింతటిలో సాధ్యమయేలా కనపడదు.

కాని పారిశ్రామికంగా పురోగమించిన దేశాలలో ముఖ్యంగా జనాభా తక్కువగావున్న దేశాలలో ఇటువంటి పరికరాలు తయారుచేయడానికి అఖండమైనకృషి జరుగుతోంది. లోగడ నైరుతిజర్మనిలోని ఒక వ్యవసాయపరికరాల కంపెనీవారు యిటువంటి ఎలక్ట్రానిక్‌ట్రాక్టరుని ప్రదర్శించినప్పుడు, అది చాలావిజయవంతంగా పనిచేసింది. పొలానికి ఒకమూల రేడియోవంటి ఒకట్రాన్స్‌మిషన్ సెట్టు ఏర్పాటుచేశారు. దానిమీటలు నొక్కినప్పుడు విడుదలఅయిన హైఫ్రీక్వెన్సీ తరంగాలవల్ల ట్రాక్టరులోని యంత్రాలు పనిచేసి నాగటిచాలు లోతుగా కావాలంటే లోతుగానూ, మెరకగా కావాలంటే మెరకగానూ వచ్చింది. అలాగే మీటలు నొక్కి ట్రాక్టరుని వెనకకి తిప్పడానికీ, కుడికీ, ఎడమకీ తిప్పడానికీ వీలవుతుంది. నాగలిచాలు తిన్నగా కావాలంటే తిన్నగానూ, వంకరటింకరలుగా కావాలంటే వంకరటింకరలుగానూ చేయవచ్చు.

ఈరకంట్రాక్టర్లని వాణిజ్యఫాయాలో తయారుచేయడానికి యింకాకొంతకాలం పడుతుంది. అంతేకాదు; ఈ పరికరాలు, యీరకంట్రాక్టర్లు చాలాఖరీదయినవి. అయినా యీకంపెనీవ్యవహర్తలు కొద్దిపరిశోధనలు జరిగినతర్వాత యిది వాణిజ్యఫాయాలో తయారుచేయగలమని ఆశిస్తున్నారు. దీనిలో యింకా అనేకమార్పులు కూడా చేయవల్సివుంది. ఇది ఎలా పనిచేస్తున్నదీ చూడడానికి వీలుగా దీనికి టెలివిజన్‌సౌకర్యంకూడా ఏర్పాటు చేస్తే ఈరకంట్రాక్టర్లతో సుమారు 550ఎకరాలభూమిలో సేద్యంచేసుకోవచ్చు.

ఈరకంట్రాక్టర్లకి కంపెనీవారు "భూతపుట్రాక్టర్లు" అని పేరుపెట్టారు. దీనిని అమలులో పెట్టడానికి మరోరకంపెద్ద యిబ్బందికూడా వుంది. వాతావరణంలో విమానాలకోసం, ఇతరరేడియో, వైద్యసౌకర్యాలకోసం హైఫ్రీక్వెన్సీ తరంగాలు అనేక రకాలవి ప్రసారంఅవుతోంటాయి. అవిగనుక పొరపాటున యీభూతపు ట్రాక్టరు పనిచేసేతరంగదైర్ఘ్యంవే గనుక అయితే, ట్రాక్టరు భూస్వామి చెప్పినదోవనికాక మరోదోవని బయలుదేరుతుంది. కాగా దీనివల్ల ప్రమాదాలు జరగకుండామాత్రం తగుఏర్పాట్లు చేశారు. ట్రాక్టరు ముందు ఏర్పాటుచేసిన ఒకప్రత్యేకమైనకడ్డీకి, ఏవిధమైన అడ్డు తగిలినా వెంటనే ట్రాక్టరు పనిచేయడం నిలిచిపోతుంది. దీనివల్ల 'భూతం గట్టుదాటి గోతులోగాని, లేదా పక్కపొలంలోగాని ప్రవేశించే ప్రమాదం లేదు. దీనివల్ల జనసంపద తక్కువఅయిన జర్మనీవంటి దేశాలలో వ్యవసాయదార్లకి చాలాసహాయం లభిస్తుంది. మామూలుగా ట్రాక్టర్లు నడపడం చాలాశ్రమ అయినపని. దీనివల్ల డ్రైవర్లకి అనేకరకాలవ్యాధులు వస్తాయి. ఈభూతం ట్రాక్టరువల్ల అటువంటిశ్రమకి, వ్యాధులకి గురికానక్కరలేదు.

(ఇంట్రా)

# శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్

తల్లీ బిడ్డా ఇద్దరూ ఒకేసారి మెట్రిక్ పరీక్షకు కూచోడం, నలుగురు పిల్లలతల్లీ పదహారేళ్ల బాలికా ఇద్దరూ ఒకే రకమైన పట్టుదల ఉత్సాహాలతో చదవడం— ఇట్లా వయోభేదంలేని విద్యాభ్యాసం అన్ని స్కూళ్లలో, కాలేజీల్లో సాధ్యంకాదు. దేశంలో ఇన్ని స్కూళ్లు, కాలేజీలు స్త్రీలకు ప్రత్యేకంగా వున్నాయి. ఏకాలేజీలో అయినా తల్లీ బిడ్డా ఇద్దరూ ఒకే కాలేజీకి వెళ్లి ఒకే తరగతిలో చదువుకోడం చూశారా! ఉహూ, చూసిఉండరు. వయోభేదంలేకుండా అన్ని వయస్సులవాళ్లను గుమిగూర్చి పరీక్షలకు పంపే సంస్థ ఆంధ్ర మహిళాసభ ఒక్కటేనేమో అనిపిస్తుంది. పదహారేళ్ల కూతురుండి బాధ్యతలు తీరిపోయి, కాలక్షేపంగాని గృహిణి, దుర్గాబాయమ్మగారి సలహావల్ల కూతురుతోపాటు చదువుకొని, తల్లీ, బిడ్డా ఇద్దరూ ఒకేసారి పరీక్షకు కూచోడం జరిగ్గింది. ఇటువంటి అద్భుత విషయాలు, స్త్రీచైతన్యం ఆంధ్ర మహిళాసభ వంటి సంస్థలలోనే వీలవుతుంది. ఎందుకని ప్రశ్నించుకుంటే ఆసంస్థలకు పునాదిరాయివంటి దుర్గాబాయ్‌గారి వల్లనే ఇటువంటివి సాధ్యం అవుతాయనిపిస్తుంది. బీద, గొప్ప, వయసు, వృద్ధాప్యం— ఇవేమీ ఆమె గమనించదు. ప్రతిస్త్రీ చదువుకోవాలి. ప్రతిఒక్క స్త్రీ చదువుకొని, స్వశక్తిమీదనిలబడగలగాలి. అందుకని ప్రతిస్త్రీ ఏదో ఒక వృత్తి విద్యలో ఉత్తీర్ణురాలై ఉండాలి అని ఆమె ఆశయం. ఆ ఆశయ సిద్ధికోసం, అహర్నిశలూ స్త్రీ జనాభ్యుదయానికై పాటుపడే అద్భుత వ్యక్తి శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్. అందువల్లనే యాభై యేళ్ల స్త్రీకూడా తన వయసును మరిచిపోయి విద్యార్థిని కాగలుగుతుందామె సమక్షంలో.

అసలు కొందరి హస్తవాసి మంచిదంటారు. అటువంటి అద్భుత హస్తవాసిగల వ్యక్తుల కోవకు చెందిందీమె. ఏకార్యం తలపెట్టినా, ఏసంస్థ నెలకొలిపినా— అది తామరతంపరవలె పెరిగి, బహుముఖాలుగా అల్లుకుపోతుంది. శ్రీమతి దేశముఖ్ నెలకొల్పిన సంస్థలు గురించి ఒక్కసారి సింహావలోకన చేస్తే, ఒక్క వ్యక్తి ఇన్ని పనులను ఎట్లా జయప్రదంగా నిర్వహించ గలిగిందా అని ఆశ్చర్యము కలుగుతుంది.

ఒక వ్యక్తి ఉన్నతుడైతే ఆ సంస్థలు కూడా మహోన్నత స్థితికి వస్తాయి. తాత్కాలికమైన కీర్తి, ప్రయోజనాలకు మొలిచే సంస్థలు కాలగర్భంలో అతి త్వరగా కలిసిపోతాయి. అదే నిస్వార్థంగా, ఉన్నత ఆదర్శాలతో, విశాలహృదయంతో ఉంటే, ఆ నెలకొలిపిన సంస్థలు కూడా కలకాలం ప్రజోపయోగకరంగా ఉంటాయి. ఆంధ్ర మహిళాసభ వంటి సంస్థ దిన దిన ప్రవర్ధమానమవుతోంది అంటే, ఏదో అప్పుడప్పుడూ విరాళాలిచ్చిన ధనవంతులూ, అడపాదడపా సహాయం చేసిన ప్రభుత్వమూ—ఇవికావు; ఈ సంస్థల వెనుక ఉన్న వ్యక్తి యొక్క సహృదయం, కార్యదీక్ష—ఈ రెండే ముఖ్య కారణాలు.

పోయిన నెల నాలుగో వారంలో ఆంధ్ర మహిళాసభ రజతోత్సవ మందిరమునకు శంకు స్థాపన జరిగింది. ఈ మందిరం అడయారులో ఉన్న ఆంధ్ర మహిళాసభా నర్సింగ్‌హోమ్ వద్ద నిర్మింపనున్నారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీసంజీవయ్య ఈ మందిరానికి శంకు స్థాపన చెయ్యగా, మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజు ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించారు. వచ్చే సంవత్సరంనాటికి ఆంధ్ర మహిళాసభ పుట్టి పాతిక సంవత్సరాలు అవుతుంది. ఈ రజతోత్సవానికి ఈ మందిరం కట్టిస్తున్నారు. సుమారు డెబ్భై అయిదు వేల కిమ్మతుగల ఈ మందిరం రజతోత్సవంనాటికి పూర్తి అవుతుంది. ఆనాటి ఉత్సవానికి శ్రీ నెహ్రూ, శ్రీ రాధాకృష్ణన్ వంటి ప్రముఖులు విచ్చేస్తారు. ఈ సందర్భంలో దుర్గాబాయ్‌గారు చేసిన మహిళాసేవను ఆమె నెలకొల్పిన సంస్థలను ఒక్కసారి తిరిగి సింహాలోకనం చేద్దాం.

ఈమె జీవితం, రాజకీయరంగ ప్రవేశం అన్నీ చిత్రమైనవి. జైలుకెళ్లి, విడుదలై వచ్చాక, ఓ మీటింగులో ఈమెకు ఆంగ్లభాషరాదని హేళన చేశారట కొందరు. ఆ హేళనే ఈమెపట్ల గొప్ప ఆశీర్వాదమయినది. సుమారు ఇరవై ఏళ్ల ప్రాయంగల ఈమె పలక పట్టుకుని ఎ. బి. సి. డీ లు దిద్దటం మొదలుపెట్టారు. బెనారస్ మెట్రిక్, ఇంటర్, బి. ఏ., ఎం. ఏ. పూర్తి చేసుకుని, మద్రాసులో బి. ఎల్. పూర్తిచేసి, హైకోర్టులో ప్రాక్టీసుపెట్టారు. స్వయంకృషితో, ఒక వయస్సు వచ్చాక, ఇన్ని పరీక్షలలో ఇంత శీఘ్రగమనంతో ఉత్తీర్ణులు అయిన స్త్రీలు బహు అరుదు.

1937 లో మైలాపూర్‌లో ఉన్న ద్వారకా కాలనీలో బాలల క్లబ్‌గా ప్రారంభమయింది. ఆంధ్ర మహిళాసభ ఇట్లా పిల్లల క్లబ్‌గా ఆరంభించిన ఈసంస్థలో కొద్ది మంది ఆడపిలలకు చదువు చెప్పడం ప్రారంభించారు.

ఆదిలో ఆంధ్ర మహిళాసభ రాయపేట హైరోడ్డులో ఉండేది. మొదట్లో శ్రీమతి దేశముఖ్ ఆమె తల్లిగారు, ఇంకా కొందరు, విద్యార్థినులకు బోధిస్తూండేవారు. ఈ నాటికీ అమ్మమ్మగారు అని ప్రేమతో పిలువబడే పూజ్యురాలు కృష్ణవేణమ్మగారు హిందీ చెపుతూండేవారు. మొదట్లో కొద్ది మంది పిల్లలతో ప్రారంభమయిన ఈ మహిళా సంస్థ క్రమంగా అభివృద్ధి చెంది, స్వంత గృహాన్నీ, హాస్టల్‌నీ నిర్మించుకోగలిగింది. బెనారస్, ఆంధ్ర, మద్రాసు మెట్రిక్‌లకు ఏటేటా విద్యార్థినులను తయారుచేసి పంపుతున్నారు. ఈవిద్యాలయానికి అనుబంధంగా, పారిశ్రామిక విద్యాలయం, ఆంధ్ర మహిళా పత్రిక, ముద్రణాలయం, నాగేశ్వర శిశువిహారం మొదలైనవి నడుపబడుతున్నాయి.

ఫస్టు పరీక్షలేగాక ఉపాధి వృత్తులయిన కుట్టు, ఎంబ్రాయిడరీ, చేనేత, నూలు వడుకుట, ఊలు అల్లికలు, కంపోజింగ్, బైండింగ్, ప్రింటింగ్ మొదలగు వాటిలో ప్రభుత్వ పరీక్షలకు విద్యార్థినులను తయారు చేస్తున్నారు. అతి బీదలైన స్త్రీలకు ఈ ఉపాధివృత్తులను ఉచితంగా నేర్పుతున్నారు. ఆంధ్ర మహిళా సంస్థకు చెందిన ఆంధ్ర మహిళ పత్రికలో కంపోజింగ్, బైండింగ్ వగైరాలు స్త్రీలే నిర్వహిస్తున్నారు. మహిళాసభకు అనుబంధంగా ఉన్న నాగేశ్వర శిశు విహార్‌లో ప్రాథమిక పాఠశాల నడుపుతున్నారు. ఈ చెప్పినవన్నీ మైలాపూర్‌లో గల ఆంధ్ర మహిళాసభకు అనుబంధంగా ఉన్నవి.

ఈ సంస్థ ఇప్పటికి ఎనిమిది వేల మంది స్త్రీలను, ఉన్నత విద్యలో, వృత్తి విద్యల్లో, ఉత్తీర్ణులను చేసి, వారికి స్వయం శక్తిని చేకూర్చి పెట్టింది. ఆంధ్ర మహిళాసభకు తొలి రోజుల్లో పనిచేసినవారికి ఈ సంఖ్య చెపితే నిజంగా ఇంత మందికి కొత్త దారి చూపామా? అని ఆశ్చర్యపోతారు. తొలి రోజుల్లో అంటే, నలభై యాభైల మధ్య, మద్రాసులో తెనుగువాళ్ళు అంటే దుర్గాబాయ్‌గారు వదిలేవారు కారుట. కొత్త కుటుంబం వచ్చిందీ అంటే వాళ్ళను వెతికి పట్టుకుని, వారి చేతికి ఏదో ఒక పని అప్పజెప్పేవారుట. "నాకేం తోచటం లేదు. పొద్దుపోవటం లేదు"— అని ఏగృహిణేనా ఏకాంతంగా అనుకుంటే, ఈమెకు వినిపించేదిట. అలాటి వారిని వెతికి పట్టుకుని "ఈ పని మీమీద పెడుతున్నా. ఇది చేసి పెట్టాలి" అనేవారు. అన్నిటికంటే చిత్రమేమిటంటే వానపాముల్లా ఉన్న మనుషులు కూడా మహిళాసభ ప్రాంగణంలో అడుగు పెట్టగానే, లేళ్లలా ఉత్సాహంగా ఉరకలు పెట్టే వారుట. దసరా ఉత్సవాలు, ఆంధ్ర మహిళ జన్మదిన సంచికలు, నాటకాలు, వినోదాలు, ఆటల పోటీలు, విచిత్ర వస్త్రధారణ పోటీలు, బొమ్మలకొలువులు— ఆ దసరా మూడు రోజులూ అదేదో పెళ్లిలా జరిగిపోయేవి. అటువంటి ఉత్సాహమూ, కార్యదీక్ష ప్రతి ఒక్కరికి, ఇటు విద్యార్థిని నుంచి, అటు అధిక విరాళాలిచ్చిన జమీందారిణి దాకా ప్రతిఒక్కరిలో నెలకొల్పే శక్తి ఒక్క దుర్గాబాయ్‌గారిలోనేఉంది; మరెవ్వరిలో లేదు అంటారు.

యాభై రెండు ఆగస్టులో ఆంధ్ర మహిళాసభ స్త్రీ జనాభ్యుదయంలో మరో అడుగు ముందు వేసింది. అడయారులోని పన్నెండెకరాల స్థలంలో ఆంధ్ర మహిళా సభ నర్సింగ్‌హోమ్ నిర్మించారు. దానిలో ఆర్థోపీడిక్ సెంటర్ ముఖ్యమైనది. ఇటువంటివి మనకు అరుదు. ఇందులో వికలాంగులైన బాల బాలికలికలకు, చికిత్స, సంరక్షణ, వారి కనువగు విద్య నేర్పబడుతున్నవి. ఈ నర్సింగ్‌హోంలో నెలకు అయిదు వేల మంది వైద్య సహాయం పొందుతున్నారు. కుటుంబ నియంత్రణం, నర్సింగ్, మిడ్‌వైఫరీ, షీటిల్లో విద్యార్థినులకు శిక్షణ ఇవ్వబడుతోంది. ఇప్పటికి అరవైఏడు జట్లు మంత్రసానులను తయారుచేసి పంపారు. ఏడాదికి అరవై మందికి శిక్షణ గరుపుతూంటారు ఈవృత్తిలో.

ఈ ఆంధ్ర మహిళాసభకు అనుబంధంగా హైద్రాబాద్‌లో ప్రాంతీయ హాండీక్రాఫ్ట్ ఇన్‌స్టిట్యూషన్ నడపబడుతూంది. చేనేత పరిశ్రమల విద్యాలయం, హాస్టల్ రెండూ నడపబడుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నాలుగు ఎకరాల స్థలం ఈ విద్యాలయానికి మంజూరు చేశారుట. త్వరలోనే ఇక్కడ కూడా మరో మహిళా సభా భవనం ఉద్భవించవచ్చు.

ప్రజాహిత కార్యాలు చెయ్యడం— కొందరికి జన్మతఃవస్తుంది. వారి రక్తంలో ఈ ప్రజా సేవాభారం జీర్ణించిపోయి ఉంటుంది. అటువంటివారు ప్రపంచంలో ఏమూలకు పోయినా, తమచుట్టూ వుండే వ్యక్తుల క్షేమం గురించే పాటుబడుతూంటారు. కాలం, ప్రదేశం— ఈ రెండూ వారికి అంటవు. దుర్గాబాయ్‌గారు ఈ కోవకు చెందినవారు.

1948 లో శ్రీమతి దుర్గాబాయ్ భారత రాజధాని ఢిల్లీకి వెళ్లారు. ఈమెతోపాటు ఈకార్యభారం కూడా ఢిల్లీకి తరలి వెళ్లింది. ఢిల్లీ వెళ్లిన కొద్ది రోజులల్లోనే దాక్షిణా

త్యులకు ప్రత్యేక విద్యా సౌకర్యాలు లేని లోపం ఈమె గ్రహించింది. ఉద్యోగ ధర్మాన దక్షిణాది నుంచి అనేక కుటుంబాలు రాజధానికి వెళ్లాయి. అటువంటివారి పిల్లలకు మాతృభాషాపాఠశాలలు కరువయ్యాయి. దానితో పిల్లలు పెద్దలూ, చాలా బాధలు పడాల్సివచ్చేది. నలభై ఎనిమిది లో శ్రీమతి దుర్గాబాయ్ కొలది మంది బాలబాలికలతో ఆంధ్ర ఎడ్యుకేషనల్ సొసైటీ స్కూల్ ని స్థాపించారు. మొదట్లో కొలదిమందికి స్థాపించబడ్డ ఈస్కూల్ ప్రస్తుతం పదకొండు వందల మంది బాలబాలికలకు చదువు చెప్పుతూంది. క్రమ క్రమంగా వృద్ధి పొందుతున్న విద్యార్థుల సంఖ్యతో, పాఠశాల ఒక్కటేకాక, కాలేజీ కూడా అవసరమైంది. భర్తృహరి చెప్పినట్లు ధీరులైనవారు ఒక పని మొదలు పెట్టారంటే, దాన్ని మధ్యలో విడవరు. చివరంటా కొనసాగించి తీరుతారు. రాజధానిలో దాక్షిణాత్యులకు హైస్కూలేకాక కాలేజీకూడా నెలకొల్పబడింది ఈ సంవత్సరం. ఈసారి శ్రీమతి దుర్గాబాయ్ మానవమాత్రులని కాక సరాసరి దేవుడినే వెతికి పట్టుకున్నారు. ఆ వడ్డీకాసులవాడిచేత ఘట్టి మొత్తాన్ని విరాళంగా వేయించారు. తిరుపతి దేవస్థానంవారు ఈ స్కూలును కళాశాలగా చెయ్యడానికి ప్రస్తుతం అయిదు లక్షల రూపాయలు మంజూరు చేశారు. సైన్సూ, ఆర్ట్సు క్లాసుల భవనాలకూ, బాల బాలికల హాస్టలు గృహాలకీ మొత్తం మరో తొమ్మిది లక్షల రూపాయలు కూడా ఇస్తారుట. ఇంత ధనాన్ని యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ వారు కాలేజికి ఇస్తారు. ఈకాలేజీని వెంకటేశ్వర కాలేజి ఆఫ్ ఆర్ట్సు అండ్ సైన్సు అని పిలుస్తారు. భవన నిర్మాణం మొదలుపెట్టలేదు, కాబట్టి ప్రస్తుతానికి ఈ కాలేజీని హైస్కూలు భవనంలోనే నెలకొల్పుతున్నారు. మూడు వందలమంది బాలబాలికలతో ఈ నెల పదిహేనోతేదీన మొదలుపెట్టబోతున్నారు. మొట్ట మొదటి దక్షిణాది విద్యాలయం, మోతీబాగ్ సమీపంలో పదిహేను ఎకరాల సువిశాల ప్రదేశంలో ఈకాలేజీ భవన నిర్మాణం మొదలుపెట్టారట. రేపు ఆగస్టు పన్నెండున శంకుస్థాపన జరుగుతుంది. భవన నిర్మాణానికి. ఇంగ్లీషు, తెలుగు, తమిళం, హిందీ, గణితం, అర్థశాస్త్రం, రాజ్యాంగం, భూగోళం మొదలుగాగల సబ్జెక్టులలో డిగ్రీకోర్సు ఉంటుందిట. అనతికాలంలోనే ఓ చిన్న విద్యాసంస్థను కాలేజీగా మార్చి, వందలాది దాక్షిణాత్యులకు విద్యావకాశాలు కల్పించడం సామాన్య విషయం కాదు. అటువంటి కార్యదీక్ష, చొరవ శ్రీమతి దుర్గాబాయ్ కి ఉగ్గుపాలతో వచ్చిన విద్యలు.

ఇన్ని సంస్థల వ్యవస్థాపనేకాదు. ఊరూరా, పల్లె పల్లెలో వెలసిన మహిళా మండలులు, కుట్టు కేంద్రాలు, సంక్షేమ కేంద్రాలు— ఇవన్నీ ఈమె చేతి చలవే. మారుమూలపల్లెలలో ఉన్న స్త్రీలకు ప్రసూతి సౌకర్యాలు కలగచేయాలనీ, ప్రపంచ జ్ఞానము, విద్య గరపాలని ఈమె తాపత్రయం. ప్లానింగ్ కమిషన్ ద్వారా, సాంఘిక సంక్షేమ కార్యక్రమం ద్వారా స్త్రీ జనాభ్యుదయానికీ, శిశు సంక్షేమానికీ ఈమె అనన్యమైన సేవ చేశారు. దేశంలో మూల మూలలనున్న సేవా సంస్థలకు ఆర్థిక సహాయం చేశారు.

ఈమె తన కార్యనిర్వహణపట్ల ఎంత పట్టుదల, ఏకాగ్రత చూపుతారంటే —స్త్రీ విద్యపట్ల కేంద్ర విద్యా మంత్రి తగినంత శ్రద్ధ చూపడంలేదని ఈ మధ్యనే కేంద్ర విద్యాసంఘం అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చారు. తృతీయ పంచవర్ష ప్రణాళికలో బాలికల విద్యకు ప్రత్యేకంగా తగినంత ధనం కేటాయించలేదు. ఇందువలన తాము ఆశించిన విధంగా బాలికలకు బాలురతో సమంగా విద్య నేర్చుకునే అవకాశం తక్కువవుతోందని ఈమె అభిప్రాయం. తమ ఆశయాలు, అభిప్రాయాలు అనుకున్న విధంగా రూపం దాల్చక పోడంతో, ఆ పదవికి రాజీనామా ఇచ్చేశారు. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే, ఆమె నమ్మిన ఆశయాలకు, ముఖ్యంగా స్త్రీ జనాభ్యుదయానికి ఏమాత్రం లోపం జరిగినా ఆమె భరించలేరు. కుండ బద్దలుకొట్టినట్లు రాజ్యాంగ యంత్రంలో గల లోపాలు ఎత్తిచూపి మరీ తప్పుకున్నారు ఆ పదవి నుంచి. "నేను ఆ పదవిలో ఉండి చెయ్యగలిగినంత స్త్రీ సేవ చెయ్యలేనపుడు, ఆ పదవిలో నేనుంటేనేం, ఇంకొకరుంటేనేం? అందుకే నేను తప్పుకుంటున్నాను" అని అర్థం వచ్చేటట్లు చెప్పారు ఈ మధ్య ఒక పత్రికా ప్రకటనలో.

ఇన్ని సంస్థలు, ఇంత కార్యభారం తమ భుజాలమీద మోస్తూన్న ఈమె, ఈనాటికీ తనతో పనిచేసినవారిని, తన సంస్థల్లో చదువుకున్నవారిని, వేలల్లో అయినాసరే గుర్తించి పలకరిస్తారుట. ఈ ఆంధ్ర మహిళాసంస్థల్లో చదువుకున్న వేలాది విద్యార్థినులు దేశంలో నలుమూలల పాకి వున్నారు. వాళ్లల్లో ఏఒక్కరూ-అవకాశం వుంటే ఆమెను చూడకుండా వెళ్లరు. ఎంతటి కార్యక్రమంలోఅయినా సరే ఎప్పుడో చదువుకున్న విద్యార్థినిని వెంటనే గుర్తుపట్టి క్షేమసమాచారాలు విచారిస్తారుట. మొన్న ఒక ఆంధ్ర మహిళావిద్యార్థిని చెప్పగా నాకు ఆశ్చర్యం వేసింది

నేను చదువుకున్న టీచర్లు లెక్చరర్సులో చాలా మందికి నే చదువుకున్న సంవత్సరం, నాపేరు చెపితేగానిగుర్తుకు రాను.దుర్గాబాయమ్మగారు అట్లా కాదు. మొహం చూస్తూనే గుర్తించి ఎంతో ప్రేమగా పలకరిస్తారు. అందుకే నాకు ఎన్ని చోట్ల చదివినా, ఈ సంస్థ ఒకటే నా స్వంతం అనిపిస్తుంది"-అని. ప్రతి విద్యార్థిని హృదయంలో ఎంత స్నేహార్ద్ర భావాలు ఉన్నాయో అనిపిస్తుంది.

స్నేహితులను, ఆదిలో తనతో కలిసి పని చేసినవారిని మరవకుండా ఆదరించడంలో ఈమెకు ఈమే సాటి. ఆంధ్ర మహిళా సంస్థ తొలిరోజుల్లో చాలా పనిచేసి, ఈనాడు కుటుంబం కలతలతో చీకాకులకు లోనైన ఒకానొక గృహిణి ఈమెను ఒకసారి కలుసుకోవాలని అమధ్య ప్రయత్నం చేశారు. అనన్యమైన కార్యభారంతో ఉన్నారు, శ్రీ దుర్గాబాయ్-కేంద్ర, ఆర్థిక మంత్రిగారి గృహిణి. ఉన్నత పదవిలో ఉన్న ఈమెకు తను జ్ఞాపకంఉంటానా, అని ఆ సామాన్య గృహిణి భయం. అంతకు రెండు మూడు సార్లు వారి ఇంటికెళ్లి. కార్యదర్శిని చూడటానికి వీలులేదంటే వెనక్కు-వచ్చేశారుట. ఒకసారి తెగించి సరాసరి మేడమీదికి వెళ్లి వరండాలో కూచున్నారట. లోపల ఏవో కాయితాలు చూసుకుంటున్న దుర్గాబాయ్‌గారు ఎందుకో తెర తొలగించి, వరండాలో ఉన్న ఈమెను చూసి- "అరె, మీరా-ఎంత సేపయింది వచ్చి ? అక్కడ కూచున్నారేమిటి పరాయివాళ్లలా! లోపలికి రండి" అంటూ పేరు పేరునా కుటుంబంలోని అందరి క్షేమసమాచారాలు విచారించి అర గంటసేపు ఎంతో ఆప్యాయంగా, ఆదరంగా మాట్లాడారుట. ఈ అరగంటలో ఆగృహిణికి కొండంత ధైర్యం, ఆత్మబలం వచ్చాయి. "నేనేదో-ఎందుకూ పనికిరానిదాన్నన్న నిరాశ పోగా, ఆమె ఆదరణతో నాకు కొంత విలవ ఉంది అనిపించింది. అమూల్యమైన ఆమె కాలం నేను వృధా చేస్తున్నానేమో అని నాకు ప్రతిక్షణం అనిపించేది. కాని ఆమె వదుల్తేనా? చెయ్యి పట్టుకు కూచోబెట్టి, ఆత్మబంధువులాగా ఎంతో సానుభూతితో నా బాధలన్నీ విన్నారు. ఆవిడ వినటంతో నాకు కొంత శాంతి కలిగింది" అన్నారు-చెమ్మగిలిన కళ్లతో. ఇట్లా మానవత కోలుపోకుండా బ్రతకగలగడం ఎంత మందికి చేతనవును ఈరోజుల్లో;

ఇంత కార్యభారాల్లో, ఇన్ని పనుల్లో దుర్గాబాయ్‌గారు తమ ఆత్మీయతను, ఆదరణను మరిచిపోరు. పెద్దరాజకీయవేత్త దగ్గరనుంచి అనాధస్త్రీదాకా అందరూ ఆమెకు ఒకటే; వారి వ్యక్తిత్వం ఆత్మ గౌరవం కాపాడుతూ మాట్లాడుతారామె. అందరినీ సమానంగా సమాన ఫాయలో ఆదరించగల విశాల హృదయం ఆమెది. ఢిల్లీలోఉన్న ఆంధ్రులు ఆమె ఇంటికివెళ్తే- "దొడ్లో గోంగూర ఉంది ఓగుప్పెడు కోసి తీసుకెళ్లండర్రా. మా దోసపాదు కాయలుకాసింది. పప్పులో వేసుకోండి పట్టుకెళ్లి" అంటూ ఎంతో సహజంగా, ఆత్మీయంగా అంటారుట. "ఆవిడ ఇంటికి వెళ్లితే, ఏదోగొప్ప వాళ్లింటికెళ్లినట్లుండదు. మన తోటి ఇల్లాలింటి కెళ్లినట్లు ఉంటుంది"అంటారు చాలా మంది.

తను ఉన్నతురాలవడమే కాదు, తనతోటివారిని కూడా తన అంతస్థుకు తీసుకెళ్లాలనే తృష్ణ ఉంది ఈమెలో. బాపూజీ ఆశీర్వాద బలంతో జీవితం మొదలుపెట్టినవ్యక్తులలో మానవత్వం గోల్పోనివారిలో ఈమె ఒకరు;అందుకనే పతితలు, గృహిణులు, బీదలు, గొప్పవారు, సామాన్యులు, సొసైటీస్త్రీలు, అనాకారులు, సౌందర్యమూర్తులు, విద్యావిహీనులు, విద్యాధికులు అన్ని తరహాలకు చెందిన స్త్రీలను ఆకర్షించి వారిని ప్రజాసేవ వైపు తిప్ప గలుగుతున్నారు ఈమె. (ఆంధ్రప్రభ వారపత్రికనుండి)

---

## అశ్రు తర్పణం

క్రిందటి నెల 30-8-61 తే॥ బుధవారంనాడు పూజ్యులైన తాడిమళ్ళ కృష్ణాబాయమ్మగారు స్వర్గస్థులైనారు. అని ప్రచురించటానికి చింతిస్తున్నాము. ఆమె ఆత్మకు శాంతి కలుగుగాక,

తాడిమళ్ళ శేషగిరిరావు.

# విమల

**"వాణి"**

"నాకు ఆర్డర్సు వచ్చేశాయి పెద్దమ్మా! రేపే బయలుదేరి భిలాయ్ వెళ్ళి జాయినవాలి' అంటూ వేణు వరండాలో కూర్చొని భగవద్గీత చదువుకుంటున్న జయతో చెప్పాడు.

"చాలా సంతోషం నాయనా! బాగా పనిచేసి మంచిపేరు తెచ్చుకోవాలి. నిన్ను ఇంజనీరింగు చదివించడానికి తన సర్వస్వమూ ధారపోసిన మీ అమ్మయీ సంతోష సమయంలో లేకపోయింది. ఆ అమాయకురాలిని నేను వాత్సల్యంతో చూడలేకపోయాను' జయ కళ్లు తుడుచుకుంది. అటువంటి తల్లిని నిరాదరణ చేసిన విషయం గుర్తుకొచ్చి వేణు చాల బాధపడ్డాడు.

గతస్మృతులు వారిని వెనుకకు తీసుకొనిపోయాయి.

చండశాసనుడైన అవధానికి నలుగురు ఆడపిల్లలు. ఇద్దరు మగపిల్లలు. సొంతఊరిలోనే మేష్టరు పనిచేస్తూ కొద్దిపాటి పొలం, యిల్లు పెట్టుకొని కాలక్షేపం చేసేవాడు. క్రమంగా ముగ్గురాడపిల్లల పెళ్ళిళ్ళకు, మగపిల్లల చదువులకు పొలం ఖర్చయిపోయింది. ఆఖరిపిల్ల విమల తండ్రి కోపపడినా, అన్నల ప్రోత్సాహంతో థర్డుఫారం ప్యాసయింది. విమల సాధారణ సౌందర్యవతి. సంపన్నుడు కాని అవధాని, ఆమెకు ఇరవై సంవత్సరాలు వచ్చినా వరాన్వేషణలో విజయం పొందలేక పోయాడు. తల్లి దండ్రుల ఆవేదన, ఇరుగు పొరుగుల ఆక్షేపణలు అమె నెంతో బాధించేవి.

జయ అవధాని రెండవ కుమార్తె. అమె భర్త ప్రకాశరావు, బ్యాంకు ఏజంటు. ఇద్దరు పిల్లల తల్లి అయిన జయకు మూడవకాన్పు కష్టమై జబ్బుచేసింది. ఆ సందర్భంలో అక్కకు సపర్య చేయడానికి విమల వెళ్ళవలసి వచ్చింది.

ఆమె తన శక్తి వంచన లేకుండా అక్కకు, ఆమె కుటుంబానికి సేవచేసింది; జయ కోలుకుంది.

"నీదయవల్ల మీ అక్కకు నెమ్మదించింది. ప్రకాశరావు మరదలితో అన్నాడు."

"నాదయేముంది బావా! అదృష్టవంతులం కనుక ఆమెను దక్కించుకోగలిగేం. మెల్లగా జవాబిచ్చింది" ప్రకాశరావు నవ్వాడు.

"నిద్రాహారాలు మాని నీవు అక్కనే కనిపెట్టుకొని ఉండటం నాకు తెలియదనుకున్నావా విమలా!" ప్రకాశరావు సూటిగా ఆమె కళ్ళలోకి చూశాడు. ఆ కళ్ళలో... యేదో.... యేదో భావం విమలను వెంటాడసాగింది.

ఒకనాటి సాయంత్రం వంట ముగించి విమల ముస్తాబవుతూంది. ప్రకాశరావు వచ్చి వెనుకనే నిలబడటం ఆమె గమనించలేదు.

"చాల అందంగా ఉన్నావు విమలా!" బావ కంఠస్వరం విని ఆమె త్రుళ్ళిపడింది,

'నేను సౌందర్యవతిని కానని తెలిసి నన్ను హేళన చేయడంలో నీవు పొందే ఆనందం యేమిటిబావా!' ఆమె కంఠంలో బాధ తొణికిసలాడింది.

"నిజంగా నిన్ను పరిహసించడంలేదు విమలా!" అన్నాడు. ఆమె తిలకం దిద్దుకోవడం పూర్తిచేసుకొని గుమ్మంవైపు తిరిగింది. కాటుకతో మెరుగులీనే కళ్ళు జడలోని మల్లెల సువాసనా, ఏకాంతమూ అతన్ని ఉద్రిక్తుడిని చేశాయి.

"విమలా!" ప్రకాశరావు చేతులు విమల నడుము చుట్టేశాయి.

"బావా! ఏమిటిది!" కాని ఆ మాటలు ఆమె పెదవులు దాటి రాలేదు. ఆ స్పర్శలోని సుఖం ఆమెను లొబరుచుకొంది. ప్రకాశరావు ఏకపత్నీవ్రతం విమల కన్యాత్వం ఆ క్షణాన పరస్పరాకర్షణ ముందు తలలు వంచేశాయి.

విమలకు నీరసం ప్రారంభమైంది. ఆందోళన ఆవరించిన హృదయంతో కొద్దిరోజులకే బాగా చిక్కిపోయింది. స్వతహా మంచివాడైన ప్రకాశరావు నిర్భయంగా విమల ముఖంలోకి చూడలేకపోయాడు.

రెండు నెలలు గడిచాయి. జయకూ అనుమానం యెక్కువై చెల్లెలిని నిలదీసింది. విమల మౌనంగా కన్నీళ్లు కార్చింది.

"ఎంత ఘోరమైన పనిచేశావు విమలా! కుటుంబానికి తలవంపులు తెచ్చావు. ఆ దుర్మార్గుడిని దూరంగా వుంచాలనే జ్ఞానం నీకు లేక పోయిందా?" ఉద్రేకం

ఆపుకోలేని జయ విమల చెంప చెళ్ళుమనిపించేటంతలో ప్రకాశరావు వచ్చి ఆమె చేయి పట్టుకున్నాడు.

'విమల నిరపరాధి జయా! నేరస్థుడిని నేనే. ఈ సంసార బాధ్యతలను మీ రిద్దరూ పంచుకోండి.' అన్నాడు ప్రకాశరావు. ఎంతో ఆలోచించి యీ నిర్ణయానికి వచ్చాడు. తన వలన విమల నిండుజీవితం నాశనమవడం అతనికి న్యాయంగా తోచలేదు. తనకు తెలియదని తప్పుకున్నా తను నెవరూ దండించరు, కాని విమల అమాయకురాలు! తెలిసో తెలియకో తనకు సర్వస్వాన్ని అర్పించింది! అటువంటి విమల బ్రతుకును నవ్వులపాలు చేయడం అమానుషం.

భర్తమాటలు విన్న జయకు కోపం, అసూయ కలిగాయి.

"నా యింట్లో తింటూ నా సంసారంలో చిచ్చు పెట్టిన పాపిష్టిదానివి. తక్షణం వెళ్ళిపో" జయ మాటలను ప్రకాశరావు అసహ్యించుకున్నాడు. కాని తప్పు తనది కావడంవలన తగ్గక తప్పలేదు. దీనవదనంతో నిల్చున్న విమలను చూచేసరికి జాలి కలిగింది.

"విమల నీ తోబుట్టువు జయా! ఈపరిస్థితిలో ఆమె అల్లరిపాలు కాకుండా చూచే బాధ్యత నీది. నేను నీకేవిధంగా లోటు రానివ్వను" అన్నాడు.

"వీల్లేదు. ఎంతమాత్రం" కోపంతో ఆమె పిచ్చిదే అయింది.

విమలను తీసుకొని వెళ్ళడానికి అవధాని వచ్చాడు. సంగతి తెలిసి మండిపడ్డాడు.

"నాకడుపున చెడబుట్టావు. నాకికముఖంచూపకు" అని అరిచాడు. మరునాడుదయాన్నే యెవరితో చెప్పకుండా వెళ్ళిపోయాడు. విమల తల్లి, భర్త నోటికి జడిసి లోలోపల మథన పడసాగింది.

విమల జయకొక సమస్యగా పరిణమించింది. ఇరుగుపొరుగుల గుసగుసలు ఆమెను మరింత రెచ్చగొట్టాయి.

"విమల యీ యింట్లోంచి వెళ్తేనే నేను ఆహారం తీసుకుంటాను." జయ తనతుది ఆయుధాన్ని ఉపయోగించింది.

ఆ రాత్రి! గడియారం పన్నెండు కొట్టింది. అశాంతితో నిద్రపట్టక బాధపడుతూన్న ప్రకాశరావు కిటికీ వద్దకు వచ్చాడు. విమల బావివైపు వెళ్తూండటం చూచి కంపించి గబగబా పరుగెత్తాడు.

"నామీద యేమాత్రం జాలిఉన్నా నావరికి అడ్డురాకు బావా," అని విమల తనకడ్డంగా నిలుచున్న బావను వేడుకుంది. ప్రకాశరావు అప్రయత్నంగా ఆమెను తన హృదయానికి హత్తుకున్నాడు.

"లోకం ఒప్పకపోయినా, నీఅక్క వీల్లేదన్నా, నా మనస్సాక్షిగా నీవు నాభార్యవే విమలా! నీవు జీవితాన్ని అంతంచేసుకోవడం నేను సహించలేను. నిన్ను నేను అన్యాయం చేయను," అని మాటయిచ్చాడు. అతని విశాలభావాలు ఆమెకు బ్రతుకుపై ఆశను పుట్టించాయి.

''ధన్యురాలిని బావా," అతని పాదాలు కళ్ళకు అద్దుకొని లోపలికి వెళ్ళిపోయింది.

ప్రకాశరావు విమలకొక యిల్లు చూసి సుఖంగా కాలంగడపటానికి అన్నిసదుపాయాలు చేశాడు. ఆమె కాలాన్ని వృథాచేయకుండా భాషాజ్ఞానాన్ని వృద్ధిచేసే పుస్తకాలను చదువసాగింది.

నవమాసాలు పూర్తయాక, ఒకనాటి సుప్రభాతాన పండువంటి పిల్లవాడిని ప్రసవించింది. తన ప్రతిబింబమైన పసివాడిని చూస్తూ, మొగ సంతతిలేని ప్రకాశరావు మురిసిపోయాడు, కాని వారికి, తనకు మధ్య అడ్డుగోడలున్నాయి! తన యింట్లో, స్వహస్తాలతో హాయిగా బాబును పెంచుకొనే అవకాశం లేదు! ప్రకాశరావు చాల బాధపడ్డాడు.

కొద్దిరోజులు గడిచాయి. తనమూలంగా అక్క సంసారంలో రోజురోజుకూ యెక్కువవుతున్న అశాంతి విమలను దహింపజేయ సాగింది. తనవద్దకు రావద్దని బావతో చెప్పింది.

"నాబాబును చూసుకొనే హక్కు లేకుండా నీవు కూడ నన్ను నిరాదరిస్తున్నావా?" అన్నాడు రుద్ధకంఠంతో. అతని మాటలు విని విమల భోరున యేడ్చింది. అక్కపై కోపంవచ్చింది. కాని ఆలోచిస్తే జయలో తప్పు లేదనిపించింది. తన పత్నీ జీవితంలో భాగమివ్వడానికి యేస్త్రీ ఒప్పుకుంటుంది? తను ఆపరిస్థితిలో ఉంటే అలాగే ప్రవర్తించేదేమో!

మరునాడు బాబుకు ఆటవస్తువులు తీసుకొని వచ్చిన ప్రకాశరావు యింటికి వేసిన తాళం చూచి తెల్లబోయి

బరువెక్కిన హృదయంతో వెనక్కు వెళ్లిపోయాడు.

విమల విశాఖపట్నం చేరుకొని ట్రైనింగులో చేరింది. తన నగలమ్మగా వచ్చిన సొమ్మును జాగ్రత్తగా వాడుకుంటూ ట్రైనింగు ప్యాసయి ఒక పల్లెటూళ్లో టీచరుగా ప్రవేశించింది. కొన్నాళ్లు పల్లెజనులామెను బాగానే ఆదరించారు.

"మీ ఆయన యెక్కడున్నాడు? ఎప్పుడూ రాడేం? నీమెళ్లో నల్లపూసలు కనబడవే! మీరు పోట్లాడుకున్నారా? అయినా పండంటికాపురాన్ని వదులుకొని ఉద్యోగంయెన్నాళ్లు వెలిగిస్తావు?" అంటూ మోటుగా విమలను విమర్శించసాగారు. జవాబుచెప్పలేక ఆమె సతమతమయ్యేది. ఒకరోజు కరణం భార్య మరీగ్రుచ్చి అడిగితే విమల విసుగ్గా కసిరింది. తత్ఫలితంగా వారు ఆమె నా ఊరినుండి సాగనంపారు.

విశాఖపట్నంలోనే అతికష్టంమీద ఉద్యోగం సంపాదించింది. కొడుకు వేణును చూస్తూ తనదుస్థితికెంతో దుఃఖించేది.

"అమ్మా! నాన్నగారేరి?" వచ్చీరాని మాటలతో అడిగే వేణును కౌగలించుకొని బావురుమనేది. వేణు భవిష్యత్తుకోసం గుండె దిటవు చేసుకొని మెట్రిక్ పరీక్షకు చదవసాగింది.

విమల బి. ఏ. పూర్తిచేసి రాజమండ్రి వెళ్లింది. ప్యాసయి అక్కడే ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయినిగా చేరింది.

వేణు స్కూలుఫైనలులోకి వచ్చాడు.

"అమ్మా! నన్నందరూ మీనాన్నగారేరి?" అని తెగవేధిస్తున్నారు. ఎక్కడున్నారో నువ్వెప్పుడూ చెప్పవు. నేనీబాధ పడలేను," వేణు చికాకుతో తల్లిని నిలదీశాడు. పెట్టె సర్దుతున్న విమల నీళ్లునిండిన కళ్లతో వేణుముఖంలోకి చూచింది. ప్రకాశరావు ఫొటో చూపించి, వీరే "మీనాన్నగారు," అని చెప్పింది.

"మనకెందుకు దూరంగా ఉంటున్నారమ్మా! ఫొటో చూస్తు ఆత్రుతగా ప్రశ్నించాడు.

"నామీద నీకేమాత్రం ప్రేమ ఉన్నా యిక ఆసంగతి ప్రస్తావించకు వేణూ!" అని చేతుల్లో ముఖాన్ని దాచుకుంది.

వేణు లేతహృదయంతో తెలియని ఆరాటం, బాధ రేగాయి.

వేణు ఇంజనీరు కావాలని విమల ఆశయం. వేణు కూడ యింటరు మంచిమార్కులతో ప్యాసయి కాకినాడ ఇంజనీరింగు కాలేజీలో సీటు సంపాదించాడు. వేణు తెలివితేటలు చూచి అధ్యాపకులెంతో ముచ్చటపడేవారు. అన్ని రంగాల్లోను అతనికుండే చాతుర్యం చూచి కొంతమంది విద్యార్థులసూయపడేవారు. వేణు అందరితో ముభావంగా ఉండేవాడు.

ఫైనలియరు పరీక్షలు సమీపించాయి. ఒకరోజు వేణు మనిఆర్డరు ఫారంపై సంతకం పెడుతుంటే ఒక కొంటెకోణంగి అందుకొని చూశాడు.

"ఎప్పుడూ నీకు డబ్బు మీ అమ్మగారే పంపుతారేం? మీ నాన్నగారికి డబ్బుపెత్తనం లేదా?" అని ప్రశ్నించాడు.

"మీ నాన్నగారి గురించి యెప్పుడూ ప్రస్తావించవేం వేణూ?" మరొకరి ప్రశ్న.

"వాళ్లమ్మ వన్నెల విసనకఱ్ఱ! వేణుకి తండ్రులకేం కొదవ?" రాజమండ్రి నుండి వచ్చిన విద్యార్థి వేణును బాహాటంగా అవమానపరిచాడు. అంతా వెకిలిగా నవ్వారు. వేణు అవమాన భారంతో క్రుంగిపోయి గదిలోకి వెళ్లిపోయాడు.

తన తల్లి! అహో రాత్రాలు తనకోసం కృషిచేసి చదివిస్తున్న తన తల్లి సుశీల కాదా? ఏమో! ఆమెను చుట్టు ప్రక్కలవారంత గౌరవంతో చూడరు! తమ యింటికి సాధారణంగా యెవరూ రారు! తండ్రి సంగతి యెత్తితే మౌనంగా కన్నీళ్లు కారుస్తుంది! ఆలోచనలతో వేణు బుఱ్ఱ వేడెక్కిపోయింది.

వేణు వద్దనుండి ఉత్తరం రాకపోయేసరికి విమల కంగారు పడింది. వేణు ఆరోగ్యం యెలాఉందో? లేక వేణు కూడ అందరిలాగే తనను అపార్థం చేసుకున్నాడా? విమల యిక ఆగలేక సెలవుపెట్టి కాకినాడ వెళ్లింది. వేణును రమ్మని కబురంపింది.

పరీక్షల హడావిడిలోను, వికలమైన మనస్సుతోను ఉన్న వేణు కబురుతెచ్చిన వ్యక్తిని కసిరికొట్టాడు. విషయం అర్థం చేసుకొని విమల వెంటనే రాజమండ్రి వెళ్లిపోయింది.

ఇల్లు చూసేసరికి విమలకు దుఃఖం పెల్లుబికింది. ఈ యింట్లోనే వేణు ఆడుతూ, చదువుకుంటూ పెరిగాడు. దుష్టసహవాసాలకు దూరంగాఉండి, వెన్నవంటి హృదయాన్ని స్వంతం చేసుకున్న వేణు యెంత కఠి

నుడైనాడు! "అమ్మా! అమ్మా! అంటూ తననొక్క క్షణమైనా వదలి ఉండలేని వేణు తనను చూడటానికే అసహ్యించు కుంటున్నాడా? క్షణికావేశానికి లోనై వేణుకు జన్మనిచ్చింది! శిశుగా లోకనిందలను, కష్టాలను యెదుర్కొంటూ మొండిధైర్యంతో వేణు ఉన్నతికోసం పాటుపడింది! వేణు తనను నిరాదరిస్తున్నప్పుడు తనిక యెవరికోసం బ్రతకాలి?

కొద్దిరోజులకే విమల ఆరోగ్యం దిగజారిపోయింది. ఆమె పరిస్థితి చూచి ఇరుగుపొరుగులు భయపడి వేణుకు వైరిచ్చారు.

పరీక్షలు పూర్తియేసరికి వేణు బాగా నీరసించిపోయాడు. ఆహారం, నిద్ర దూరమైనాయి. వైరు చూసి మొదట ఆందోళన పడినా, వెళ్లడానికి మనస్కరించక ఊరుకున్నాడు. కాని రెండు రోజులు. మానసిక సంఘర్షణకు లోనై, చివరకు తల్లియందున్న ప్రేమకు, గౌరవానికి తలబగ్గాడు.

స్టేషనువైపుగా నడచిపోతూన్న వేణు అమిత నీరసంతో ఉన్నందువలన స్పృహతప్పి రోడ్డుమీద పడిపోయాడు. క్షణంలో అందరూ చేరారు. నాలుగు రోజుల క్రితమే అక్కడికి బదిలీ అయి వచ్చిన ప్రకాశరావు అందరితోపాటు వేణును చూసాడు. హృదయంలో అర్థం కాని బాధ, వాత్సల్యం ఉప్పొంగాయి. వేణును దగ్గర్లోనే ఉన్న తన యింటికి తీసుకొని వెళ్లాడు.

తెలివి వచ్చాక వేణు ప్రకాశరావు ముఖంలోకి పరీక్షగా చూశాడు.

"మీ పేరు తెలుసుకోవచ్చునా?" వినయంగా అడిగాడు. ప్రకాశరావు చెప్పాడు. "మీకు 'విమల' అనే ఆమె తెలుసా?" అప్రయత్నంగా ప్రశ్నించాడు. ప్రకాశరావు క్షణకాలం స్తంభించి పోయాడు.

"క్షమించండి, మీకు, మానాన్నగారికి దగ్గర పోలికలున్నాయి. మానాన్నగారి పేరు కూడ ప్రకాశరావు. నేనెప్పుడూ వారిని చూడలేదు. మిమ్మల్ని చూడగానే యేదో ఆసక్తికెత్తి అడిగాను. వస్తాను," నైరాశ్యంతో లేచి గుమ్మంవైపు తిరిగాడు. ప్రకాశరావు తలగిట్టున తిరిగింది. విమల కొడుకు వేణూ.... ! కాదు...,! కాదు.... ! తమయిద్దరి ప్రేమఫలం వేణూ....?

"వేణూ ! వెళ్లిపోకు వేణూ ! నేనే....? నేనే నీ తండ్రిని," అని అరిచాడు.

"నాన్నా !" పితృప్రేమ వెల్లువలై పారగా ప్రకాశరావు వేణును కౌగలించుకున్నాడు.

అప్పుడే గదిలో అడుగుపెట్టిన జయ యీ దృశ్యం చూచి నిర్ఘాంత పోయింది.

"పెద్దమ్మా!" కాళ్లకు నమస్కరిస్తున్న వేణును లేవనెత్తి ప్రేమతో నిమిరింది.

వేణుద్వారా విమల సంగతులు విని వారెంతో బాధపడ్డారు. వేణును మందలించారు.

అందరూ విమలను చూడటానికి బయలుదేరి వెళ్లారు.

"అమ్మా ! నన్ను క్షమించవూ?" అంటూ వేణు పశ్చాత్తాపంతో దుఃఖించసాగాడు.

"నీకు చాల అన్యాయం చేశాను విమలా?" బాధతో విమల చేతులు పట్టుకుంది జయ.

"నాకెవరూ అన్యాయం చేయలేదక్క ! నేనే చేసుకున్నానని మిమ్మల్నందర్నీ చూస్తున్న యీ మధుర క్షణంలో నాకిక యేలోటూ లేదు. వేణును మీచేతుల్లో పెడుతున్నాను," వాత్సల్యంతో వేణును నిమిరింది.

"నన్నింకా గౌరవిస్తున్నావా విమలా ! నీకోసం వెదకటానికి కూడ వీల్లేదని శాసించి నిన్ను కష్టాలపాలు చేసిన ద్రోహిని," పశ్చాత్తాపంతో జయ భోరున యేడ్చింది.

"నీతప్పేమీ లేదక్క ! నీస్థితిలో యెవరైనా అలాగే ప్రవర్తిస్తారు. బాధపడకు," అక్కను ఓదార్చింది.

ఆఖరి సారిగా ప్రకాశరావు కళ్లలోకి చూస్తూ చేతులు జోడించింది. ఆమె జీవితం అంతమైపోయింది.

దుఃఖంతో పిచ్చివాడైన వేణును మామూలు స్థితికి తీసుకొని రావడానికి జయ, ప్రాకాశరావు చాల పాటు పడ్డారు.

అనాడే వేణు భిలాయ్ ప్రయాణం.

జయ, ప్రకాశరావుల పాదాలకు నమస్కరించి రిక్షాయెక్కాడు.

సజల నేత్రాలతో వేణు వెళ్లినవైపే చూస్తూ ఉండిపోయారు ప్రకాశరావు దంపతులు.





# శేరుకు ఎన్ని గ్రాములు?

మెట్రిక్ తూనికలు వాడకంలోనికి వచ్చాయి. మెట్రిక్ యూనిట్లకే ధరలు చెబుతున్నారు. అయినా బేరసారాలలో ధరలు కట్టడం కొంచెం ఇబ్బందిగానే వుంది.

ఎందువల్ల?

మెట్రిక్ పద్ధతిని అనుసరించకపోవడమే కారణం. పాత తూనికలలోగాని లేదా పాత తూనికలనుబట్టి మెట్రిక్ కొలతలను గట్టిగాని వస్తువుల ధరలను అడుగుతూ వుండడమే దీనికి కారణం.

ఒక శేరుకు 930 గ్రాములు
ఒక పౌనుకు 454 గ్రాములు

సక్రమంగా ధరలను అడగాలంటే ఇలా అడగాలి

1 కిలోగ్రాము (1,000 గ్రాములు)
500 గ్రాములు

ఈ తూనికల ప్రకారం ధరలు అడిగితే తేలికగా బేరాలు జరిగిపోగలవు.

## మీకు కావలసిన వస్తువుల ధరలను

**పూర్ణమైన మెట్రిక్ యూనిట్లలో అడగండి**

అది మీకు సహాయకారి
వ్యాపారికి సహాయకారి

బారత ప్రభుత్వం జారీచేసిన ప్రకటన DA 61/288

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఎడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ. ఎస్. ఎల్. సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| మహిళా మందిరము | : విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది. |
| ఆర్థోపీడిక్ సెంటర్ | : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమ కేంద్రం. |
| ముద్రణాలయము | : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు. మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్కు చేయబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది. |
| అర్బన్ వెల్ఫేరు ప్రాజెక్టు | : కపాలి తోట్టంలోను నారాయణస్వామి గార్డెన్ లోను బీదలకు సంక్షేమ కార్యక్రమముల నిర్వహింపబడుతోంది. |
| వనితా బాలవిహార్ | : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం |
| రీజియనల్ హాండీక్రాఫ్ట్సు యిన్స్టిట్యూట్ | : ఆంధ్రమహిళాసభ, హైదరాబాదు బ్రాంచిచే నడుపబడుచున్న, చేతిపనుల శిక్షణాలయము |

# జయంతి

## శ్రీ S. K. నిరుపమ గురుకుల్

వుత్తరం చూచిన రామయ్యగారు చాలా సేపు అలా కూచోని పోయాడు. పార్వతమ్మ దీపాలవేళ వెలుపలి కొచ్చింది వంటగదినుంచి. తనభర్త అట్లా షికారు వెళ్ళాడని అనుకొంటుండిన ఆమె, ఆయన అట్లు దిగులుపడి కుర్చీకతుక్కొని కూచుని వుండడం చూచి ఆమె ఆశ్చర్య పోయింది. "అదేమిటండీ! నామతిమరుపు మండిపోను" మీరు అట్లా పురుషోత్తంగారితో వెళ్ళారని అనుకొంటుండి నాను "అన్నది దగ్గరికొచ్చి. పార్వతమ్మ ఖంగుమని మాట్లాడుతుంది. ఆమె మాటలు నిజంగానే రామయ్యని ఈ లోకంలోకి తెచ్చింది. ఫేనువేసి ఆమె ఆయన కెదురుగా కూచుంది. రామయ్య మాట్లాడకుండా వుత్తరం అందించాడు.

పార్వతమ్మ బుగ్గలు నొక్కుకొంది. వయసుమళ్ళు తున్నా పరిహాసాలకి తక్కువేంలేదు. ఈ ముక్కలు నే చదివేందుకే?''

''చదివించుకో!" రామయ్య మెల్లగా కండువాతీసి విదిలించి భుజానేసుకొని చేతికట్ట అందుకొని వెళ్ళి పోయాడు.

ఆయన వెళ్ళేవరకూ నోరుతెరుచుకొని చూచింది పార్వతమ్మ. "ఈ మనిషి ఎప్పుడూ ఇంతే. ఈ వుత్తరం చదివి చెప్పకుండా అలావెళ్ళిపోయాడేం!'' అంటూ కూతుర్ని కేకేసింది "మాలతీ" అని. ఈమె ఎప్పుడూ పిలిచేది మాలతినే, కాని పలికేది, పలికి ఆదుకొనేది జయంతే. ఇప్పుడు గదినుండి వచ్చిన జయంతి ''ఏమమ్మా?'' అన్నది.

''ఇంద తల్లి.... ఈ వుత్తరం చదువు'' ఎప్పుడొచ్చిందో ఏమో? మీనాన్నగారు అలాకూచుని పోయారిందాకా ''ఎవరు రాశారో!" అన్నాదామె.

జయంతి మనసులో చదువుకొంటున్నది గమనించి, "గట్టిగా చదువు" అన్నది భర్తమీది కోపంకొద్దీ.

''ఇది ఇంగ్లీషు వుత్తరమే. చదివిచెపుతా" ''అన్నది జయంతి. ఇంతలో మాలతి వచ్చి అక్కగారి వెనకాల నిలబడి చదువుకొంది వుత్తరం"

"బాగానేవుంది'' అంటూ వెటకారంగా కూలపడ్డాది మాలతి, మొహం తిప్పుకొంటూ. "ఏమిటే! ఏముంది వుత్తరంలో'' ఆత్రపడ్డ తల్లిని చూచి దీర్ఘ నిశ్వాసంవదిలి జయంతి అన్నది ''బావ రాశాడమ్మా! ఏదోఒకటి తేల్చమని....''

"అక్కయ్య జాతకం బాగాలేదటమ్మ! అందుకని నాజాతకం బావుందని త్వరలో ఏదో ఒకవిషయం తేల్చివెయ్యమని రాసాడు. ఆయనగార్కి పిల్లలమీద పిల్లలొస్తున్నారుట పెండ్లిచేసుకోను,'' నవ్వుతూ హేళనగా అన్నది టెంకాయ కొట్టినట్లు మాలతి.

పార్వతమ్మ నిట్టూర్చింది ''ఓఅబ్బా! దీనికా ఇందాక మీనాన్నగారు అలాకూచుని పోయారు" మాకిష్టంలేదు; వేరే సంబంధం చూసుకోండని రాస్తే తీరిపోదూ? ఏమిటీ అందరికీ భయపడిపోతాడు?"

''అత్తయ్యకి వంట్లో బాగాలేదటమ్మ'' జయంతి మెల్లగా అన్నది.

''ఆమెకెప్పుడు బావుంటుంది వళ్ళు" అసలే నంగనాచి నాంచారమ్మ. అబ్బే, అత్తయ్య సంగతినేనెరగందా! మాఅన్నయ్య వున్నన్నాళ్ళు యిలాగే రోగం రోగం అని తానే సుందర పోయేటట్లు నటనచేసేది. ఇందాక అలాగే వుంది. ఆసంగతి పెద్దఇదిగా రాయాలి వీడు" పార్వతమ్మ, తేలిగ్గా అన్నది చేయితిప్పుతూ.

"ఇంకో విషయంకూడా వుందమ్మ... బావకి నాల్గు వేల రూపాయలు నాన్నారివ్వాలట.... ఆపైకమన్నా సర్ది పంపమన్నారు. తల్లిని మదనపల్లిలో చేర్చాలట''

పార్వతమ్మ దీంతో ముఖం వికృతం చేసుకొంది. "అయ్యో రామా! అదికూడానా? తన చదువులకంతా ఎవరిచ్చింది? అడపాదడపా ఆవిడొచ్చి ఓఏడ్పు ఏడ్చి రెండొందలు, మూడొందలు ఎగరేసుకొని పోయేది. అదంతా జ్ఞాపకం పెట్టుకొన్నామా! లెక్క రాసి పెట్టామా! నాల్గువేల రూపాయలు అప్పని రాస్తాడా? ఆవెధవ భూమి ఈ నాడు వెయ్యి రూపాయలు చేయదు. అది మీనాన్నారికంటగట్టి నాల్గువేలు రూపాయలని రాస్తాడా! బాగానే వుంది!"

"మరి నాన్నారలా కూచునిపోయాడంటే అర్థం ఇది. అక్కయ్య జాతకం బావుందని మన శాస్త్రిగారన్నారు కదా! శాస్త్రం శాస్త్రమేకదా! వాళ్ళకెందుకు బాగాలేదు! అంతా అత్తయ్య చేస్తున్నది.

"కాకమరేమిటి! జయంతిని ఆవిడ ఎప్పుడూ నచ్చలేదు. కానీ పనిమాత్రం జయంతి చెయ్యాలి.... జయంతి

మాత్రం మంచిపిల్లా! నేచెప్పినట్లు ఎవరు వింటున్నారు గనక అందరూ చుక్కేదురే'' పార్వతమ్మ ముక్కు చీదుకొంది.

"నేనేం చేసానమ్మ మరీను; ''జయంతి విచారంగా అన్నది.

''చేసిందంతా నువ్వు. మీనాన్నా.... ఆవిడొచ్చి నప్పుడు వంగివంగి దణ్ణాలు పెడతే సవారి చేస్తుంది! ఎందుకు చేయదు? ఆరువేల రూపాయలప్పు అన్నా, తలన్నా తాకట్టు పెట్టి తీసుకొనిపోయి, ఇవ్వడు డబ్బు ఈ రోజుకు నాన్నా. అందుకే వెళ్ళి వుంటారిప్పుడు. నాకు తెలియదా ఏం!" పార్వతమ్మ కోపంగా లేచింది. మాలతి అక్కగారివేపు ఉరిమిచూచి పోయింది. జయంతి మాత్రం వుత్తరం మరొక్కసారి చదువుకొన్నది,

నాల్గు రోజులు గడిచిపోయింది. పార్వతమ్మ మాటలు రామయ్యని ఇంకా కృంగతీసింది. ఆయన మెల్లగానే చెప్పాడు "ఇదిగో పార్వతీ, నీకు జ్ఞప్తి లేదేమో గానీ. ఆభూమిని మనం ఇరవై వేల రూపాయలకి అమ్మి వేశాము."

పార్వతమ్మ ఒప్పుకోలేదు ''ఎందుకిలా మాటలు మారుస్తారు? అది మాబావగారి భూమి. మావదిన ఇచ్చిన భూమి ఆ ప్రాంతంలో అట్లాగే పడివుంది. మొన్న నంజయ్యగారు వెయ్యి రూపాయలకి బేరమాడి పోయాడు. మర్చిపోయారేమో"

"ఇహ నేనేం చెప్పను నీకు? చాలాలాభం వచ్చిందని ఇంకో వెయ్యి వేసి నాల్గు వేలుగా ఇస్తామన్నది మనమే. వాళ్ళకేం డబ్బు లేదా! నోరుజారి అడిగారా ఇమ్మని, ఏదీ. మనదగ్గరున్న ఆవిడ కాసుల హారం అడిగిందా! మనం ఎందుకిలా ఆడిపోసుకోవడం?"

''మీకూమీకూ ఎంతయినా తగుతుందండి. కాసుల హారం కోడలితో వస్తుందని ఆవిడ అనుకొని వుంటుంది. మనమేం మోసం చేస్తామా! అది పోనీండి. జయంతి జాతకం బాగా లేదని రాసారు. అది అబద్ధం కాదా?''

''పార్వతీ. నీకూ నీమాటలు తగులుతుంది. జయంతిని చేసుకొంటానని అసలు జాతకాల విషయమే వద్దందిగా, మీవదిన. అప్పుడు నువే మాలతికి ఈడు జోడన్నావు."

''ఇదిగోండి. కన్న కూతురికి ద్రోహం చేస్తానా నేను? అప్పటికి జయంతి అంటే నాకేదో కానట్టు మాట్లాడుతారు'' పార్వతమ్మ నిష్ఠురంగా అన్నది.

ఎవరు నీకెక్కువో ఎవరు తక్కువో ఆ విషయం నేచెప్పలేదు, మీవదినకు మాలతి తగ్గకోడలని మాత్రం యోచించావు. అంత మటుకు చెప్పగలను. ఎప్పుడు జయంతి నిస్తానంటే వద్దంటుందా ఆవిడ.''

"చస్తే ఆపెకుపిల్ల నివ్వనుగాక, ఇవ్వను. ఏం నాజయంతి తక్కువయింది? కాస్త నలుపని, నోరులేని పిల్లని, ఎంతో చాకిరి చేయించుకొంది. ఆపిల్లకు కాలు కాస్త వంకర కదా సొద్దు.... నాకు తెలియదా! ఏమ యినాసరే, వాళ్ళింటికి నాపిల్ల పోదు. ఏం రాస్తారో రాసు కోండి'' పార్వతమ్మ కోపంగా లేచి వెళ్ళిపోయింది. రామయ్య తల పట్టుకొని కూచున్నాడు. అన్నట్లుగా డబ్బెక్కడినుంచి వస్తుందిప్పుడు? చూపలేదు కానీ ఇంకో వుత్తరం కూడా రాసాడు. పాపం తల్లికి ఎక్కువగా వుందని, డాక్టరు శతవిధాలా ప్రయత్నిస్తున్నాడని'' ధన లోపం చెయ్యటం లేదని, తన మనుష్యులంటూ ఎదురు పడితే చూడాలని వుందని, ముఖ్యంగా ''జయంతిని'' చూడాలని వుందని చెప్పతోందని రాసాడు. ఆ వుత్తరం రామయ్య ఎవ్వరికీ చూపలేదు. జయంతిని పిల్చి చెపుతా మని చూసాడు కానీ సమయం చిక్కక వూరుకొని పోయాడు. పార్వతి లేసయిందా! తగుదాసరికి మెడ పూసలని మాలతినిచ్చి ఓ ఆట అడిద్దామనుకొంది. జయంతి నల్లటిదయినా చక్కని పిల్ల. కాస్త కాలు ఎత్తి వేస్తుందనిగాని, ఆ విషయంగా పార్వతే వెల్లడి చేసింది. గానీ పద్మావతి ఒక మాటకూడా అనలేదు. జయంతిని కోడలుగా తెచ్చుకోవడం పద్మావతికిష్టమే.

''నానా!.... భోజనానికి లేవండి'' అన్నది జయంతి వచ్చి.

రామయ్య నిట్టూర్చి లేచాడు. తల్లీ కూతుళ్ళిద్దరూ పైమిద్దెమీద చేరారన్నది తెల్సుకొని జయంతితో వుత్తరం విషయం చెప్పాడు. జయంతి కంట్లో నీరు తిరిగింది,

"నాన్నా! బావ గుణం నీకు తెలియదు, బావ మాలతి నయితే పెళ్ళాడుతానని నాఎదుటే అన్నాడు. అత్తయ్యకు కాకపోతే నామీద కొంచెం ఇష్టం.'' అన్నది పులుసు వడ్డిస్తో జయంతి మెల్లగా.

''ఏమిటీ వాడే అన్నాడా! అందుకే పద్మావతి మాలతిని గునిసింది. బావుంది. మసిబొగ్గు- మాణిక్యం ఏది అనేది మీబావకి ఇంకా తెలియదమ్మా! ఏదో వయసులో వున్న వాడు. వుడుకురక్తం వానిది. వానికి చెప్పవలసిన రీతిలో చెపితే వింటాడు.

# జయంతి

శ్రీ S. K. నిరుపమ గురుకుల్

వుత్తరం చూచిన రామయ్యగారు చాలాసేపు అలా కూచోని పోయాడు. పార్వతమ్మ దీపాలవేళ వెలుపలి కొచ్చింది వంటగదినుంచి. తనభర్త అట్లా షికారు వెళ్ళాడని అనుకొంటుండిన ఆమె, ఆయన అట్లు దిగులుపడి కుర్చీకతుక్కొని కూచుని వుండడం చూచి ఆమె ఆశ్చర్య పోయింది. "అదేమిటండీ! నామతిమరుపు మండిపోను" మీరు అట్లా పురుషోత్తంగారితో వెళ్ళారని అనుకొంటుండి నాను "అన్నది దగ్గరికొచ్చి. పార్వతమ్మ ఖంగుమని మాట్లాడుతుంది. ఆమె మాటలు నిజంగానే రామయ్యని ఈ లోకంలోకి తెచ్చింది. ఫేనువేసి ఆమె ఆయన కెదురుగా కూచుంది. రామయ్య మాట్లాడకుండా వుత్తరం అందించాడు.

పార్వతమ్మ బుగ్గలు నొక్కుకొంది. వయసుమళ్ళుతున్నా పరిహాసాలకి తక్కువేంలేదు. ఈ ముక్కలు నే చదివేందుకే?''

''చదివించుకో!'' రామయ్య మెల్లగా కండువాతీసి విదిలించి భుజానేసుకొని చేతికఱ్ఱ అందుకొని వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళేవరకూ నోరుతెరుచుకొని చూచింది పార్వతమ్మ. "ఈ మనిషిఎప్పుడూ ఇంతే. ఈ వుత్తరం చదివి చెప్పకుండా ఆలావెళ్ళిపోయాడేం!'' అంటూ కూతుర్ని కేకేసింది "మాలతీ" అని. ఈమె ఎప్పుడూ పిలిచేది మాలతినే, కాని పలికేది, పలికి ఆదుకొనేది జయంతే. ఇప్పుడు గదినుండి వచ్చిన జయంతి ''ఏమమ్మా?'' అన్నది.

''ఇంద తల్లి.... ఈ వుత్తరం చదువు'' ఎప్పుడొచ్చిందో ఏమో? మీనాన్నగారు అలాకూచుని పోయారిందాకా ''ఎవరు రాశారో!" అన్నాదామె.

జయంతి మనసులో చదువుకొంటున్నది గమనించి, "గట్టిగా చదువు" అన్నది భర్తమీది కోపంకొద్దీ.

''ఇది ఇంగ్లీషు వుత్తరమే. చదివిచెపుతా" "అన్నది జయంతి. ఇంతలో మాలతి వచ్చి అక్కగారి వెనకాల నిలబడి చదువుకొంది వుత్తరం"

"బాగానేవుంది'' అంటూ వెటకారంగా కూలపడ్డాది మాలతి, మొహం తిప్పుకొంటూ. "ఏమిటే! ఏముంది వుత్తరంలో'' ఆత్రపడ్డ తల్లిని చూచి దీర్ఘ నిశ్వాసంవదిలి జయంతి అన్నది ''బావ రాశాడమ్మా! ఏదోఒకటి తేల్చమని....''

"అక్కయ్య జాతకం బాగాలేదటమ్మ! అందుకని నాజాతకం బావుందని త్వరలో ఏదో ఒకవిషయం తేల్చి వెయ్యమని రాసాడు. ఆయనగార్కి పిల్లలమీద పిల్లలొస్తున్నారుట పెండ్లిచేసుకోను,'' నవ్వుతూ హేళనగా అన్నది టెంకాయ కొట్టినట్లు మాలతి.

పార్వతమ్మ నిట్టూర్చింది ''ఓఅబ్బా! దీనికా ఇందాక మీనాన్నగారు అలాకూచుని పోయారు" మాకిష్టంలేదు; వేరే సంబంధం చూసుకోండని రాస్తే తీరిపోదూ? ఏమిటీ అందరికీ భయపడిపోతాడు?"

''అత్తయ్యకి వంట్లో బాగాలేదటమ్మ'' జయంతి మెల్లగా అన్నది.

''ఆమెకెప్పుడు బావుంటుంది వళ్ళు" అసలే నంగనాచి నాంచారమ్మ. అబ్బే, అత్తయ్య సంగతినేనెరగందా! మాఅన్నయ్య వున్నన్నాళ్ళు యిలాగే రోగం రోగం అని తానే సుందర పోయేటట్లు నటనచేసేది. ఇందాక అలాగే వుంది. ఆసంగతి పెద్దఇదిగా రాయాలి వీడు" పార్వతమ్మ, తేలిగ్గా అన్నది చేయితిప్పుతూ.

"ఇంకో విషయంకూడా వుందమ్మ... బావకి నాల్గువేల రూపాయలు నాన్నారివ్వాలట.... ఆపైకమన్నా సర్ది పంపమన్నారు. తల్లిని మదనపల్లిలో చేర్చాలట''

పార్వతమ్మ దీంతో ముఖం వికృతం చేసుకొంది. "అయ్యో రామా! అదికూడానా? తన చదువులకంతా ఎవరిచ్చింది? అడపాదడపా ఆవిడొచ్చి ఓపడ్వు ఏడ్చి రెండొందలు, మూడొందలు ఎగరేసుకొని పోయేది. అదంతా జ్ఞాపకం పెట్టుకొన్నామా! లెక్క రాసి పెట్టామా! నాల్గువేల రూపాయలు అప్పని రాస్తాడా? ఆవెధవ భూమి ఈ నాడు వెయ్యి రూపాయలు చేయదు. అది మీనాన్నారికంటగట్టి నాల్గువేలు రూపాయలని రాస్తాడా! బాగానే వుంది!"

"మరి నాన్నారలా కూచునిపోయాడంటే అర్థం ఇది. అక్కయ్య జాతకం బావుందని మన శాస్త్రిగారన్నారు కదా! శాస్త్రం శాస్త్రమేకదా! వాళ్ళకెందుకు బాగాలేధు! అంతా అత్తయ్య చేస్తున్నది.

"కాకమరేమిటి! జయంతిని ఆవిడ ఎప్పుడూ నచ్చలేదు. కానీ పనిమాత్రం జయంతి చెయ్యాలి.... జయంతి

మాత్రం మంచిపిల్లా! నేచెప్పినట్లు ఎవరు వింటున్నారు గనక అందరూ చుక్కెదురే'' పార్వతమ్మ ముక్కు చీదుకొంది.

"నేనేం చేసానమ్మ మరీను; ''జయంతి విచారంగా అన్నది.

''చేసిందంతా నువ్వు. మీనాన్నా.... ఆవిడొచ్చి నప్పుడు వంగివంగి దణ్ణాలు పెడతే సవారి చేస్తుంది! ఎందుకు చేయదు? ఆరువేల రూపాయలప్పు అన్నా, తలన్నా తాకట్టు పెట్టి తీసుకొనిపోయి, ఇవ్వడు ఢబ్బు ఈ రోజుకు నాన్నా. అందుకే వెళ్ళి వుంటారిప్పుడు. నాకు తెలియదా ఏం!" పార్వతమ్మ కోపంగా లేచింది. మాలతి అక్కగారివేపు ఉరిమిచూచి పోయింది. జయంతి మాత్రం వుత్తరం మరొక్కసారి చదువుకొన్నది,

నాల్గు రోజులు గడిచిపోయింది. పార్వతమ్మ మాటలు రామయ్యని ఇంకా కృంగతీసింది. ఆయన మెల్లగానే చెప్పాడు ''ఇదిగో పార్వతీ, నీకు జ్ఞప్తి లేదేమో గానీ. ఆభూమిని మనం ఇరవై వేల రూపాయలకి అమ్మి వేశాము."

పార్వతమ్మ ఒప్పుకోలేదు ''ఎందుకిలా మాటలు మారుస్తారు? అది మాబావగారి భూమి. మావదిన ఇచ్చిన భూమి ఆ ప్రాంతంలో అట్లాగే పడివుంది. మొన్న నంజయ్యగారు వెయ్యి రూపాయలకి బేరమాడి పోయాడు. మర్చిపోయారేమో"

"ఇహ నేనేం చెప్పను నీకు? చాలాలాభం వచ్చిందని ఇంకో వెయ్యి వేసి నాల్గు వేలుగా ఇస్తామన్నది మనమే. వాళ్ళకేం డబ్బు లేదా! నోరుజారి అడిగారా ఇమ్మని, ఏదీ. మనదగ్గరున్న ఆవిడ కాసుల హారం అడిగిందా! మనం ఎందుకిలా ఆడిపోసుకోవడం?"

''మీకూమీకూ ఎంతయినా తగుతుందండి. కాసుల హారం కోడలితో వస్తుందని ఆవిడ అనుకొని వుంటుంది. మనమేం మోసం చేస్తామా! అది పోనీండి. జయంతి జాతకం బాగా లేదని రాసారు. అది అబద్ధం కాదా?''

''పార్వతీ. నీకూ నీమాటలు తగులుతుంది. జయంతిని' చేసుకొంటానని అసలు జాతకాల విషయమే వద్దందిగా మీవదిన. అప్పుడు నువేమాలతికి ఈడు జోడన్నావు."

''ఇదిగోండి. కన్న కూతురికి ద్రోహం చేస్తానా నేను? అప్పటికి జయంతి అంటే నాకేదో కానట్టు మాట్లాడుతారు'' పార్వతమ్మ నిష్ఠురంగా అన్నది.

ఎవరు నీకెక్కువో ఎవరు తక్కువో ఆ విషయం నేచెప్పలేదు, మీవదినకు మాలతి తగ్గకోడలని మాత్రం యోచించావు. అంత మటుకు చెప్పగలను. ఎప్పుడు జయంతి నిస్తానంటే వద్దంటుందా ఆవిడ.''

"చస్తే ఆపెకుపిల్ల నివ్వనుగాక, ఇవ్వను. ఏం నాజయంతి తక్కువయింది? కాస్త నలుపని, నోరులేని పిల్లని, ఎంతో చాకిరి చేయించుకొంది. ఆపిల్లకు కాలు కాస్త వంకర కదా సొడ్డు.... నాకు తెలియదా! ఏమ యినాసరే, వాళ్ళింటికి నాపిల్ల పోదు. ఏం రాస్తారో రాసు కోండి'' పార్వతమ్మ కోపంగా లేచి వెళ్ళిపోయింది. రామయ్య తల పట్టుకొని కూచున్నాడు. అన్నట్లుగా డబ్బెక్కడినుంచి వస్తుందిప్పుడు? చూపలేదు కానీ ఇంకో వుత్తరం కూడా రాసాడు. పాపం తల్లికి ఎక్కువగా వుందని, డాక్టరు శతవిధాలా ప్రయత్నిస్తున్నాడని'' ధన లోపం చెయ్యటం లేదని, తన మనుష్యులంటూ ఎదురు పడితే చూడాలని వుందని, ముఖ్యంగా ''జయంతిని'' చూడాలని వుందని చెప్పతోందని రాసాడు. ఆ వుత్తరం రామయ్య ఎవ్వరికీ చూపలేదు. జయంతిని పిల్చి చెపుతా మని చూసాడు కానీ సమయం చిక్కక వూరుకొని పోయాడు. పార్వతి లేసయిందా! తగుదాసరికి మెడ పూసలని మాలతినిచ్చి ఓ ఆట అడిద్దామనుకొంది. జయంతి నల్లటిదయినా 'చక్కని పిల్ల. కాస్త కాలు ఎత్తి వేస్తుందనిగాని, ఆ విషయంగా పార్వతే వెల్లడి చేసింది. గానీ పద్మావతి ఒక మాటకూడా అనలేదు. జయంతిని కోడలుగా తెచ్చుకోవడం పద్మావతికిష్టమే.

''నానా!.... భోజనానికి లేవండి'' అన్నది జయంతి వచ్చి.

రామయ్య నిట్టూర్చి లేచాడు. తల్లీ కూతుళ్ళిద్దరూ పైమిద్దెమీద చేరారన్నది తెల్సుకొని జయంతితో వుత్తరం విషయం చెప్పాడు. జయంతి కంట్లో నీరు తిరిగింది,

"నాన్నా! బావ గుణం నీకు తెలియదు, బావ మాలతి నయితే పెళ్ళాడుతానని నాఎదుటే అన్నాడు. అత్తయ్యకు కాకపోతే నామీద కొంచెం ఇష్టం.'' అన్నది పులుసు వడ్డిస్తో జయంతి మెల్లగా.

''ఏమిటీ వాడే అన్నాడా! అందుకే పద్మావతి మాలతిని గునిసింది. బావుంది. మసిబొగ్గు– మాణిక్యం ఏది అనేది మీబావకి ఇంకా తెలియదమ్మా! ఏదో వయసులో వున్న వాడు. వుడుకురక్తం వానిది. వానికి చెప్పవలసిన రీతిలో చెపితే వింటాడు.

"ఏంది నాన్నా నువ్వనడం! నలుపు, దానికి తోడు కాలు వంకర, అలాంటి అమ్మాయిని ఏపిల్లాడు పెండ్లాడు తానని చెప్పుకొన సాహసిస్తాడు! నాఖర్మ.... మనవంశంలో లేని నలుపు, ఈ వంకర కాలు నాకొచ్చింది." జయంతి గొంతు పట్టుకొని పోయింది. దుఃఖ భారం చాత.

"నీగుణం చూడాలి. రూపం వుంటే సరా! మొండి గోడకు సున్నం కొట్టినట్లు, తండ్రి చాలు ఆడపిల్ల అద్రుష్టం తల్లి, నేను నలుపేగా! ఈ కాలు అదీ, నీకు టైపాయిడ్ జ్వరం వచ్చినప్పుడు అశ్రద్ధవల్ల ఇలా అయింది. అంతేగానీ పుట్టుకతో వచ్చిందా! దూరమాలోచించి చూచే వాడయితే బావ తప్పకుండా నిన్ను పెళ్ళాడు తాడు. నానమ్మకం అది"

మాలతి దిగిరావడం చూచి జయంతి సంభాషణ మార్చింది. రామయ్య సంభాషణ మారిందానికి కారణం కనుక్కొని మజ్జిగన్నం తిని లేచాడు.

మరో వారం రోజులు దాటిపోయింది. నంజయ్యగార్ని కలుసుకోను వెళ్ళిన భర్త ఇంకా తిరిగి రాంది చూచి పార్వతమ్మ తహతహలాడిపోతోంది. ఆమె అనుమానం భర్త ఒకవేళ పద్మావతి వొదిన్ను చూడను వెళ్ళలేదు కదా, అని పెట్టె తెరిచి డబ్బులు జాగ్రత్తగా వుండడం కాసులహారం కదలకుండా వుండడం చూచి కొద్దిగా ధైర్యం తెచ్చుకొంది. కానీ అనుమానంతో ఆవిడ జయంతిని పదేపదే అడిగింది. ఆయన ఏంచేసినా పెద్దమ్మాయితో తప్పకుండా చెపుతాడని పార్వతమ్మ నమ్మకం. జయంతి నాకేం తెలియదంటే తెలియదంది.

ఎన్మిదోరోజు రామయ్య బండిదిగేసరికి పార్వతమ్మ ఎదురు పోయింది.

రామయ్య పలకకుండావచ్చి కూచున్నాడు. "నంజయ్యగారేమన్నారు?" అన్నది వుండబట్టలేక పార్వతమ్మ.

"స్నానానికి నీళ్ళుతోడు .. జయంతీ" సమాధానంగా రామయ్య అన్నాడు.

మొహంమీద కొట్టినట్లయింది. పార్వతమ్మకు. తనడిగిన ప్రశ్నకు జవాబేది?

"వెయ్యి ఇచ్చాడా? తక్కువిచ్చాడా?"

"మీవదిన ఇచ్చినభూమి ఆప్రాంతంలో అలాగే పడి వుందిగా! నాకు అమ్ముడు వద్దని. మీపేరిటే వుంచుకొని అమ్మి వేయమన్నాను. ఆభూమికిగాను నాల్గువేలు నా దగ్గర కేష్‌గా లేదన్నాను. నంజయ్యగారు పదివేల రూపాయలకి ఫైసలు చేసుకొని రొక్కంముందు నాల్గు వేలుఇచ్చాడు."

పార్వతమ్మ అలాగే నిల్చొనిపోయింది!

"పిల్లవాడు స్పురద్రూపి. చదివినవాడు. ఇల్లరికం వుంచుకొంటానని.... ఓరెండు లక్షల రూపాయల అధిపతి ఒకాయన వచ్చాడు. ఆపిల్లా మనమాలతి లాగే వుందికానీ....

"ఏం? కానీఏమిటి? మావొదిన ఒప్పలేదా! మీ మేనల్లుడు వొప్పలేదా!" ఎత్తిపొడుస్తూ అన్నది పార్వతమ్మ.

"ఇదిగో పార్వతీ. మనుష్యుల్ని ఎప్పుడూ వ్యంగ్యంగా దూషించవాకు. అన్నివున్నా ఆపిల్లను వీళ్ళు మెచ్చలేదు."

పార్వతమ్మకి ఏదో అనాలనివుంది. కానీ బలవంతంగా వూరుకొంది.

"నీమేనల్లుడు నామేనల్లుడూ అయిన వెంకట్రావు నీకిష్టమయితే జయంతిని చేసుకొంటానని అన్నాడు."

పార్వతమ్మ మొహం తిప్పుకొంది" మంచిబేరాలు చేసుకొచ్చారు. నేనెవ్వర్నీ ఇవ్వను....ఏం ఈనాడు నా కూతురి కాలొంకర పోయిందా! లేక తెల్లతోలు కప్పుకొందా!

ఆ మాటలు వాళ్ళనలేదు. నీ కిష్టమయితే ఇస్తానను; లేదా! లేదను" పార్వతమ్మ మొహం చిట్లించి వెళ్ళిపోయింది. రామయ్య నిట్టూర్చి లేచాడు. వింటూన్న జయంతి దీర్ఘనిశ్వాస వదిలింది. స్నానం చేస్తున్న రాస్తున్న రామయ్య అన్నాడు "మనంజయంతికి ఎక్కడ వెతకబోతామని పెళ్ళికొడుకుని. జయంతి రాసిన వుత్తరంతో అబ్బాయి కళ్ళు తెరిచాడు. ఆమె వ్యాధి నయమయింది."

జయంతి అదిరిపడ్డది. తానెప్పుడు వుత్తరంరాసింది?

పార్వతమ్మ పెదాలు కొరుక్కొంది. జయంతి పేరుతో వ్రాసిన వుత్తరం కూడా మంచే చేసిందన్నమాట! పార్వతమ్మ నోరెత్తలేదు.

# గ్రంథ సమీక్ష

వ్యాసమంజూష : కర్త : విద్వాన్ శ్రీ-కే. సంజీవ రాయశర్మ, తెలుగుపండితులు, యస్. కే. పి. డి. బాలుర ఉన్నతపాఠశాల, మదరాసు - 1. వెల: రూ 1 - న. పై. 25 లు.

విద్యార్థులకు వ్యాసరచన నేర్పటంలో ఆంగ్లోపాధ్యాయులు చూపుతూన్నంత శ్రద్ధ తెలుగుపండితులు చూపటంలేదు. మొత్తంమీద ఆంధ్రాంగ్లాల్లో రెంటిలోను నిర్దుష్టంగా బాలురు ఒకవాక్యమయినా వ్రాయుటకు తగిన జ్ఞానాన్నిగాని, బోధననుగాని పాఠశాలల్లో నేర్చుకోలేని స్థితిలో ఉండటం నగ్నసత్యం. అయితే, ఆంగ్లం విదేశభాష అనే నెపంమీద త్రోసిపుచ్చవచ్చు గాని, మాతృభాష అయిన ఆంధ్రం చదివే ఆంధ్రవిద్యార్థి అలా వ్రాయలేకపోతున్నాడంటే ఏమనాలి? విద్యార్థులకు వ్యాసరచన నేర్పే పండితులు వారెక్కడ ఎట్టిశబ్దదోషాలు, అనన్వయాలు, పదాలతప్పులు, వ్యాకరణలోపాలు చేస్తున్నారో, కడు జాగ్రత్తగా కంటిలో వత్తిపెట్టికొన్నట్టు సునిశితంగా చూస్తూ అలాటితప్పులు, పొరపాట్లు మరలా చేయకుండేటట్లు చేయాలి. ఈసందర్భాల్లో, "వ్యాసమంజూష" విద్యార్థులకు మహత్తరోపకృతి చేయగలదనటంలో సందేహంలేదు. ఇట్టి గ్రంథాన్ని వెలివఱచటంలో శ్రీశర్మగారి విద్యార్థిజనసేవ ప్రశంసార్హము. ఇందలి వ్యాసాలు 8, 9, 10 తరగతులు చదివే వారిని ఉద్దేశించి వ్రాసినవి. కాన, అట్టిబాలురకిది ఉండితీరాలి.

కౌశిక.

మిత్రబోధ : కర్త : శ్రీ బులుసు వెంకటరామమూర్తి; అష్టావధాని; గోగినేనిపురం. గూడూరు- నెల్లూరుజిల్లా. వెల తెలియదు.

ఈకృతియందు 'మిత్రమా' యను మకుటముతో 101 చంపకోత్పలవృత్తములుండుటంబట్టి, దీనిని శతకమనం జెల్లును.

ఇందలిపద్యములు నైతిక పారమార్థిక, వైరాగ్యప్రబోధకములగుట, రచయిత దీనికిడిన 'మిత్రబోధ' నామమెంతేని సార్థకముగ వెలయుచున్నది. వయస్సున పిన్నలయ్యు సంస్కృతాంధ్రములలోఁ జక్కనిపాండిత్యముం గడించి, కవిత నలవఱచుకొని, ఆబాలవృద్ధ మర్థమగు సరళశైలిలోఁ దాత్త్వికవిషయప్రబోధ మిట్లొనర్చు విజ్ఞానసంపద యీకవి కుగ్గుబాలతో బెట్టినది. మృదుమధుర శబ్దజాలములతోఁ జక్కని ధారాధోరణిగల యీ శతకగత పద్యము లత్యంతరమణీయములు.

ఈతని కవితాలత కాధారమగు కల్పకుజ కల్పులు శ్రీ గోగినేని వేంకటేశ్వరరావుగారు రసగ్రహణపారీణులు; వాఙ్మయార్చకులునై యాంధ్రికిఁ జేయుచున్న వరివస్య యనల్పము. ఎల్లర కట్టియుదారస్వభావమున్నచోఁ దెలుఁగుఁదల్లి యీపాటికి దిగ్దిగంతములఁ దన యశశ్చంద్రికలతోఁ బ్రకాశించు టెల్లవిధముల సత్యము.

మచ్చున కొండురెండు పద్యములు :—

"నరుఁడయిపుట్టినందుకు వినమ్రమతిన్
బరమేశుపాదముల్
స్థిరమతితో భజించి పరిశీలితబుద్ధిని
ధర్మనిర్మలా
దర సుగుణస్వభావమునఁ దాపసలోక
శరణ్యుఁడైన శ్రీ
హరి నెఱుఁగంగ సార్థకము హర్షముగాదె
తలంప మిత్రమా;"

నారునుపోయువాడుఁ కరుణామతి నీరును
పోయకుండునే
ధీరహితైకచిత్తమున దేవునినమ్ముచు
నాశ్రయించినన్
సారకృపాంతరంగమున సౌఖ్యములిచ్చుచు
నేలకుండునే?
కోరికమీఱ నమ్మకమెగూర్చు హితంబు
సుఖంబు మిత్రమా!

కౌశిక.

## స్వీకరంలో క్రిందిది చేర్చాలి.

విశ్వకవి :— సంపాదకులు : శ్రీజాస్తి వేంకటనరసయ్య, ప్రధానాంధ్ర పండితుఁడు; ఆర్. వి. యస్. సి. వి. హైయరు సెకండరీస్కూలు, చిలుకలూరిపేట, గుంటూరుజిల్లా. వెల 75 నయాపైసాలు.

కర్షకప్రబోధము : కర్త : చలసాని లక్ష్మీనారాయణ వర్మ, బ్యాండుపేట, కలవపాదుల పోస్టు, (వయా) ఇందుపల్లి, కృష్ణాజిల్లా — వెల 50 నయాపైసాలు.

# భగ్నజీవి ప్రేమ

## శ్రీ ఈమని నరసింహమూర్తి

ఆది సాయంసమయం. మలయమారుతమా అన్నట్లు సంధ్యగాలి వీస్తోంది. పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి. శరత్కాలం సమీపించిందని మేఘాలు లేని నిర్మల నీలాకాశం సంధ్య చీకట్లను పారద్రోలి అప్పుడే వెన్నెల వెలుగు నిచ్చు చందమామరాక కలువలానందంతో లోకానికి చెప్పాయి. కృష్ణకాలువ వొడ్డున కూర్చున్నాడు. ఎన్నో తలంపులు మనస్సుకు తట్టుతున్నాయి. సమాధానం దొరుకక మరలి పోతున్నాయి. మానవుని జీవితంలో సుఖదుఃఖాల నిష్పత్తి ఒకేలాగ ఉండవేమో అనుకొన్నాడు. ఊహామాత్రంచే భావిసౌధాల్ని నిర్మించుకున్నాడు. ఆశాంకురాలు పునాదులుగా వేశాడు. వింతపోకడలు, విభిన్నవ్యక్తులు అతని కప్పటి కర్థమయినట్లు 'ఊ' అని లేచాడు. వెన్నెల వెలుగుతో నీడ తన్ను వెంబడిస్తోంది. ఇంటి ముఖం పట్టాడు. 'ఆగండి' అన్న రాధ జేవురుగొంతుక శబ్దంతో ఈ లోకంలో పడ్డాడు. మలినంలేని మనస్సు మళ్ళీ వలపుల తలపులతో విహరింపసాగింది. భగ్న ప్రేమకుల జీవితాలు ఆత్మహత్యకు అంకితమైతే లోకాని కొక వెన్నెల వెలుగుబాట తన ఆత్మహత్యచే నిరూపించ వచ్చనుకున్నాడు. నిజమైనప్రేమ కలకాల సుఖాన్నిచ్చేది కాదన్నమాట. తన భగ్నజీవితాని కొక అంతిమమైలురాయి అయింది.

కృష్ణమూర్తి, రాధ చిన్నతనంలో ఒకే ప్రాథమిక పాఠశాలలో చదివారు. చిలిపితనంచే ఒకరి నొకరు తిట్టుకొనేవారు, కలసి ఆడుకొనేవారు. రాధ కృష్ణ మేనమామ కూతురు. కృష్ణ కల్లిదండ్రులు లేనందున మేనమామయింట్లో పెరిగాడు. చిన్నతనపు చురుకుదనంచూచి మామయ్య సుబ్బారావు పెద్ద చదువు చెప్పించి రాధనిచ్చి పెళ్ళి చేయాలనుకొనేవాడు. భార్య కాంతమ్మతో యీ విషయం చెప్పేడు. కాని ఆమెకివేమి నచ్చేవికావు. మంచిసంబంధం చూసి గొప్పగా పెళ్ళి చేయాలనేది. "దూరపు కొండలు నును"పన్న సామెత నిజమనుకొనేది. ఎంతైనా ఆ అభాగ్యానికివ్వననేది.

సుబ్బారావు సహృదయుడగుటవల్ల కృష్ణను హైస్కూల్లో చేర్పించాడు. కృష్ణమూర్తి వాతావరణం అర్థం చేసుకొని, అత్తకి అనుగుణంగా మెలగి, దీనుల రక్షణ దైవాని కెఱుకని **S. S. L. C.** పూర్తిచేసాడు. ఆభాగ్యుల్ని చేరదీసి చదివిస్తే చివరకు తమనే కూలదోస్తారన్న మూఢాలోచనకి వ్యతిరేకంగా సుబ్బారావు సాగటంచూచి ఇంక చదువు చాలిద్దామనుకొంది. కృష్ణమూర్తి అత్తయ్యా కెదురుచెప్పలేక పోయేవాడు. కాని కాలేజి చదువువొక పెద్ద సమస్య అయింది. సుబ్బారావు తీరని వేదనలో పడ్డాడు. చదివిస్తే భార్య పోరు పడలేడు. లేకపోతే లోకం, తనకే కావాలని ఆడిపోస్తుంది. కాంతమ్మను నెమ్మదిగా ఒప్పించి కాలేజీలో చేర్పించాడు. కృష్ణకి కాలేజీవాతావరణం బాగా అర్థమయింది. ఎలాగైనా కష్టపడి చదివి ఫస్టుగా ప్యాసయి అత్తయ్య మన్ననలు పొందాలనేవాడు. రాధ తనకు కాబోయే బావ పెద్ద చదువు చదువుతాడనీ... పెద్ద ఉద్యోగం చేస్తాడనీ పట్నంకాపురం గురించి ఎన్నో కలలు కనేది. ఏదో తెలియని ఆనందం అనుభవించేది.

కొద్ది రోజుల తర్వాత కృష్ణమూర్తి ఇంటరు ఫస్టుగా ప్యాసయ్యాడన్న వార్త ఊరంతా సుబ్బారావు అదృష్టం పండిందనుకునేటట్లు చేసింది. రాధ సంతోషానికి మేరలేదు. ఏమైనా కృష్ణమూర్తినే చేసుకోవాలనుకొనేది. వేసవి సెలవల్లోనున్న 2 నెలలు కలసితిరిగేవారు. ఒకరికి తెలియకుండా ఇంకొకరు కాలువ యొడ్డుకు చేరుకొనేవారు. మధురానుభూతులను, ఆకస్మికంగా, సంధ్యచీకట్లో పొందేవారు. అమాయక హృదయాలకు చీకటి సాక్ష్యం రాదన్న విషయం గుర్తెరగలేక పోయేవారు. సంధ్య చీకట్లో యింటికి చేరుకొనేవారు. వారిద్దరిలో గాఢంగా తొణికిసలాడే పవిత్రప్రేమ నిలచియుంది. కాని కాలం, విధి సహాయంచే తనపాత్ర నభినయిస్తుందన్న విషయం లోకానికి చాటగలిగే వారి కల్మష హృదయాలు చివరకు భగ్న హృదయాలవుతాయని తెలియదు.

కృష్ణమూర్తికి ఏమైనా డిగ్రీ సంపాయించాలని వుంది. మామయ్యతో వినయంగా అత్త వినకుండా చెప్పేడు. సుబ్బారావు కాదనలేకపోయేడు. కాంతమ్మ మేనల్లుడు యింటరు ఫస్టుగాప్యాసవటం చూసి, దగ్గర వాడు అల్లుడు కావటం మంచిదనుకొంది. ఏవేవో ఊహాలు ప్రవాహమాత్రంగా దొర్లసాగినవి. కాలేజీలు తెరిచేరు. కృష్ణమూర్తి **B. A.,** లో చేరాడు. కాలేజి వాతావరణానికి గత 2 సంవత్సరాలు బాగా అల

వాటు పడటంచే, కొన్ని వింత పోకడలకు మిత్రుల సహాయంచే పోసాగాడు. 'భావి జీవితాన్ని పాడు చేసుకుంటున్నావంది' ఆత్మ. పోనీ ఎంతైనా యీ రెండు సంవత్సరాలేగా అనుకొనేవాడు. 'ఆనందం, అనుభవించడానికి భావిజీవితం అడ్డా! అదృష్టంబట్టే యీ ఆనందం, కోరగానే వచ్చేదికాదు: అని ప్రతిఘటించాడు. సుఖదుఃఖాల నిష్పత్తి సమమే ననేవాడు. కాలేజీలో జరిగే వివిధ విషయాల్లో పాల్గొనేవాడు. ఒకసారి వాగ్వివాద పోటీలో అనూరాధకి ప్రతిగా నిల్చొని ఫస్టుప్రైజు సంపాదించాడు. మొదట అసూయాపరురాలైనా, కృష్ణమూర్తి వాగ్వినాద శక్తికి. వేరొక సంగీతపు పోటీలో 2 వ ప్రైజు సంపాదించి నందుకు మెచ్చుకొని పరిచయం చేయసాగింది. కొంచెం ముఖావం వహించాడు. ఆడవారి మాటలు నీటి పైన అలలని, పరిచయం స్నేహానికి మార్చాలని, ఎంతగానో అతనిని ఎదుర్కొనేది. అమ్మాయిలు ఎంతగానో హేళనచేసారు. ఆడది అంటే అబలకాదని తల్చుకుంటే ఏమైనా చేయగలదని అమ్మాయిలందరికి నీతి పాఠం నేర్పుతూ, కృష్ణమూర్తిని మాయ మాటలచే తన వానిగా చేసుకొంది. ఏవో ప్రేమ పాఠాలు నేర్పింది. చివరకు తన దాసునిగా చేసింది. వీరి పరిచయం చూసి యీర్ష్యకొందరూ, సంతోషాన్ని కొందరూ వెలిబుచ్చారు. పరీక్షలు సమీపిస్తున్నాయి. యింటి నుంచి కృష్ణమూర్తికి ఉత్తరంవచ్చింది. శ్రద్ధగా చదవి ఏవిధంగానైనా తన శక్తిని పరీక్షలలో చూపించి, తనకు మంచిపేరు తేవాలని సుబ్బారావునుంచి. కాని అనూరాధపై మోహం చివరకు తన నిత్య జీవితావసరాలను కూడా మరచిపోయేటట్టు చేసింది. పరీక్షలొచ్చాయి. తన విధి అని వ్రాసేవాడు. అంతా వీని హృదయ పరివర్తనకు చింతించారు. తెలివైనవాడు. క్లాసులో పాసు కావలసినవాడు చివరకు పరీక్ష తప్పే స్థితికి వచ్చాడని ఎందరో ఎంతగానో విచారించారు. యిదంతా కాలానికి విధి సహాయం అనుకొనేవారు కొందరు.

పరీక్షలయినాయి. భారమైనహృదయంతో యింటి ముఖం పట్టాడు. తప్పదని రోజులు గడుస్తున్నాయి.

ఫలితాలు ప్రకటించారు. పరీక్ష తప్పిందన్న విషయం ఊరంతా క్షణంలో ప్రాకింది. ఊరంతా అభాగ్యుని చేరదీసి చదివించినందుకు అయిందిలే శిక్ష, అని కొందరు. లేని పోకడలకు పోనిచ్చినందుకు కావలసిందే శాస్తి అని కొందరూ విమర్శించారు. కాంతమ్మ ఒకటేగోల...నానా దుర్భాషలు అడింది. యింటి నుంచి పొమ్మంది. తన్ను చేరదీసి చదివిస్తే మంచిపేరు తెస్తాడన్నందుకు బలేచేసాడని ఎంతగానో నిందించింది.

కృష్ణమూర్తి యింక తనకు వారితో పడదను కొన్నాడు. మళ్ళీ ఆత్మ ఘోషించింది. భావిజీవితం అంతా సర్వనాశనం అయిందని. కాని అనూరాధపై మోహం తన్నివేమీ ఆలోచించనివ్వలేదు. చదివినంత కాలం అంతా ఆమెగురించే, పైగా ఆమెనే వివాహం చేసుకుందామను కున్నందుకు రెండు విధాలా చెడ్డవాడయినాడు. అంతా తనదురదృష్టం అనుకున్నాడు. రాధను కలసి తన తప్పిదాన్ని చెప్పి బాధ పడొద్దని బ్రతిమాలుదా మనుకొన్నాడు.... కాని అత్తయ్య కాంతమ్మ క్షణం నిలువ నీయలేదు.

ప్రకృతికి తనబాధ చెప్పుకొని తనభగ్న ప్రేమనుండి విముక్తి పొందాలని కాలువ వొడ్డుకు చేరేడు. కాని ప్రకృతి తనకేం కావాలనట్లుంది. రాధశోకానికి అంతే లేదు. తన అలనాటి కలలు లీలలయ్యే యని ఎంతో విచారించింది. ఏ విధంగానైనా బావనుకలసి అతనితో తన హృదయవేదన చెప్పాలనుకొంది. కాని తల్లి కాంతమ్మ రాధ విచారం చూసి ఓదార్చటానికి బదులు తిట్టేది. రాధ యింక తన జీవితానికి ఆనందసమయం రాదని అదే అంతిమసమయం అని ఆత్మహత్య చేసు కొంది....

కృష్ణమూర్తి లోకం తీరుని తలచుకొని చింతిస్తూ, యింక యింటికి పోకూడదని నిశ్చయించుకొని ఆత్మహత్యకు సిద్ధమయ్యాడు. కాని మనస్సు వప్పుకోలేదు. తన ఆత్మహత్య యింకోజీవానికి చావును కల్పిస్తుందని కాని.... రాధ ఎప్పుడో గతించింది. ప్రతిక్రియకు చింతిస్తు లేచాడు. రాధ బావను ఒప్పించి తీసుకు పోదామని ఆగండి అన్నట్టుగా లీలగా సమీపించింది. కాని వారిద్దరు భగ్నప్రేమికులు అంతా లీల. ...భగ్న ప్రేమికులజీవితాలు ఆత్మహత్యకు అంకితమైతే ప్రకృతి సహిస్తుందా? .... నిదర్శనంగా కాలువంతా పూలమయమయింది.

———

# ప్రారబ్ధము

## శ్రీ నారు నార్య

మ॥ కలవో! లేవో? యెఱుంగఁగాని, యతి
లోకంబైన నిన్ గూర్చి, యు
జ్జ్వలగాథాశతముల్ సహస్రములు వి
స్తారమ్ము కవ్యగ్రణుల్
దలపోయన్ ద్రవియించు గుండె సిలయై
నన్ గాని నీశక్తిని
చ్చలు బల్కుడఁ దరమ్మె నాకు గడుదు
స్సాధమ్ము! ప్రారబ్ధమా॥

కలవో? లేవో! యెవండెఱుంగు? నిపుడీ
కష్టావళింగూర్చి లో
కులు వాకొంట నొకింత పేరువిని, ట
క్కుల్ గాదటంచెంచి నీ
విలసద్రూపము జూపఁ గోరితి బురా
బీజస్వరూపంబ! నా
కెలనన్ వచ్చితివిప్డు నీగుణముదక్కన్ నాకుఁ బ్రారబ్ధమా॥

కలవో! లేవో! భవిష్యదుద్యమ ఫలా
కాంక్షా విమర్శాగ్రణుల్
పలుకన్ జాలుదురేమొ? నాయెఱుకకే
లాగైన దుర్భేద్య మీ
యిల నిక్షేపరహస్య మెల్లెఱుఁగు ట
ల్లేకాదొకో? తావకో
జ్జ్వల గాథానిబిడార్థ సంగ్రహణకై
చర్చింప. బ్రారబ్ధమా!

అదియొకటే, మహాత్తరప
దార్థము "తత్త్వము" దానిగూర్చి నె
మ్మది గడునమ్మువారికి సు-
మా యిసుమంతయు నీవులేవు, నీ
కుదిరిక లేని చెయ్వులును
గొంచెతనమ్ములు లేవుగాని, యె
ల్లిదమయినన్ సరేయని బ
లే! యని నమ్మెడివారి జీరదే!

కొందఱు నిన్నుఁగూర్చి తల
కన్ బరువౌదని యెంచినారిఁకన్
గొందఱు. నీవు లేవనియె
గొప్పమదిన్ మనినారు, కాని నా
డెందము నిన్నుగూర్చి ప్రక-
టించె నొకండదె ఘోరసంస్కృతిన్॥

గుండెడివారిగట్టైదురఁ
గ్రూరగతిన్ జరియింతువంచొగిన్॥
తలఁపఁగ సత్యమద్ది! బహు
ధా సభలన్ వచియించినాఁడ! నీ
విలసితరూపమున్ గుఱిచి
విస్మృతరీతుల నాఁడు నేఁడు నా
కలమిన కష్టనిష్ఠురభ
యాకులతన్ గని సంశయించి నీ
వలన ఘటిల్లెనేమొ? యని.
ప్రాక్తనసత్యము నమ్మ, నెమ్మదిన్॥

విత్తినపైరు కోఁతకగు!
వేఱొకపంట లభించు టెట్లొ? లో
కోత్తర నీతి యిద్ది, సమ
యోచితరీతుల మారుపాటు లే
కొత్తునె? సృష్టినైజమిఁక
నీనవనాగరకుల్ విచిత్రవా
గ్వృత్తి జపించు పాతముఱ
వే! యని నవ్వకుమమ్మ! మమ్మిటన్॥

కాలము శూలమై పొడువఁ
గా మనపెద్దలసుద్ది పోయి పో
గాలము దాపురించి కల
గాపులగమ్మయి పాపపుణ్యముల్
దీలువడెన్, ఋతమ్మిఁకఁ బ
డింబడిగా నిజమెంచఁబోక నీ
కాళులబ్రేళులం బడిన
కారణమేమి? పురాకృతాకృతీ!॥

నిను బేర్కొన్న శ్రుతిస్మృతుల్ గలవు ని
ష్ణాతప్రథావాగ్విమ
ర్శనలుం బెక్కులు నిక్కగానిఁ బుధమా
ర్గంబందు పోగల్గు వా
నిని నేడైనను జూడ జాలవిఁక మ
న్నిశ్చేయ మాత్మేతరం
బణుమాత్రమ్మును లేమి నీ వనఁగ— లె
క్కా? పక్కా? దృగ్దర్శికిన్॥

"కోహం" తత్త్వవిచారధీరులు నినున్
గొండాడ రింతేని, ను
త్సాహోద్రేక విభిన్నమానసులు సం
సారుల్ నినున్ భీతస
మ్మోహాత్మన్ భజియించు చుందురిదె, సం
పూర్ణైకసత్యమ్ము, దా
సోహమ్మంచనుటో? యెదిర్చిమనుటో
యస్మత్ స్వధర్మంబిఁకన్॥

అదియే కారణమో, వచింప దరమా—
నా? లోక మందెల్ల నె
య్యది బాధించిన దాని బల్కుదురిఁకన్
బ్రారబ్ధ మంచున్ గతా
భ్యుదయముల్, నేనిఁక లెక్కచేసెడు విధం
బున్ గూర్చి వ్రాయంగ న

వృధదుశేకాని యొకింతలాభ మెటుల
[illegible] బ్బర జూడ ప్రారబ్ధమా॥
ప్రణుతింతుర బదివేల సార్లయిన నో
ప్రారబ్ధమా! నిన్ను మిం
చినవాం డన్య్య డొకండు గల్గు నెపి పర
శ్రేయంబు వాంఛించువా
రిని నీవే దల నెక్కి త్రొక్కెదవు వా
రింజేర్చెదో! నన్ను — లే
క నయమ్ముంగొని నీ ‘హితుండనని
మ్రొక్కంగ చేసెదో! సత్కృపక॥
ఏనాం టికైన గానీ
యేసరుం డే, యైనగాని - యించుక నినుస
న్మానింపని-చో మానవు
డౌనా! జీవితము వానిదౌనా? యౌనా?॥
ప్రారబ్ధమనుభవించిన
వారించుర గర్మ రిత్తపలుకులు వలుకక

దీరుశేపి యను పెద్దలనుడు
లారయ, నాకగు, శరణ్యా-మంతో
యింతో॥

ఎపుడో సంయమివర్యులాడిన పదం
బీనాండు హృత్క్షేత్రమం
దపురూపంబయి నిల్చె దాని విడు టె
ల్లొ శాసనాకారమై
విపులక్ష్మాతల మెల్లం బ్రాకినది నీ
పేరింక నీమానవుల్
జపియింతుర్మనసార దారకమటుల్
భావించి ప్రారబ్ధమా!

పరహితమె జీవితాశయ
పరమార్థంబంచు నెంచిం బ్రదుకు నరులకు
పరభాగ్య జీవిచే దు
ష్పరిపాకం బెట్టులాదవు ప్రారబ్ధంబా!

---

# నిరపరాధి

## కుమారి వరుణ

రమణమూర్తి అఫీసుగదిలో కూర్చుని, అప్పుడేవచ్చిన ఉత్తరాలను చూస్తున్నాడు. అందులో ఒక కవరు ఆఫీసుకు తన పేరనే రావటంచూచి ఆశ్చర్యపోయాడు. ఎప్పుడూ తన ఉత్తరాలు ఆఫీసుకురావు. మిగతా ఉత్తరాలను ప్రక్కకునెట్టి ఆ కవరు చించాడు. పూర్తిగా చదివేసరికి అతనికి కళ్లు ఎరుపెక్కాయి. శరీరం వణకిపోతోంది, పళ్లు పటపటలాడుతున్నాయి. అతను ఏమిచేస్తున్నాడో అతనికే తెలియటంలేదు.

సాయంత్రం అయిదు గంటలయింది. అడుగులో అడుగు వేసుకుంటూ, ఆలోచనలతో సతమతమవుతూ యింటికి చేరాడు. చిరునవ్వుతో ఎదురు వచ్చిన భార్య భానుమతివంకకూడ చూడలేదు. తిన్నగా తనగది లోనికి పోయాడు.

అతని ప్రవర్తనకు భార్య నిర్ఘాంతపడి పోయింది. "ఎప్పుడూ చిరునవ్వుతో మాట్లాడేవారు.అలాంటివారు ఈరోజున ఎందుకు యిలా నా ముఖం వంక కూడా చూడకుండా వెళ్ళిపోయారు. ఆపీసులో ఏమైనా గొడ డపడ్డారా? లేక నేను ఏమైనా తప్పుచేశానా?" యిటు వంటి ఆలోచనలతో అరగంట గడచిపోయింది. భర్త బయటకు రాకపోయేసరికి తనే గదిలోనికి వెళ్లింది.

రమణమూర్తి ఆలోచనలో మునిగిపోయి భార్య రాకనుకూడ గమనించలేదు. అతని ముఖంలో ఏదో బాధ వ్యక్తమౌతోంది. జేబులోని కవరు పైకితీసి, తిరిగి అందులోని ఉత్తరాన్ని చదువసాగాడు. అందులో ప్రియమైన భానుమతికి!

నేను క్షేమముగానే యున్నాను. నీవుకూడ క్షేమ మేనని తలుస్తా. నీవు యిచ్చట నుండి వెళ్ళినప్పటి నుండి నాకు ఏమియు తోచుటలేదు. సినిమాలకు, షికార్లకు వెళ్ళటం మానివేశాను. భోజనము చేస్తున్నా నిద్రిస్తున్నా, చివరకు పపని చేస్తున్నా నువ్వే గుర్తుకు వస్తున్నావు. నా హృదయంలో నీవు సంపాదించు కున్న స్థానం యింతవరకు ఎవరూ ఎప్పుడూ సంపా దించుకోలేక పోయారు. ఇకముందుకూడా ఎవరూ నా హృదయాన్ని దొంగిలించలేరు. నా హృదయాన్ని దొంగిలించి, నన్ను నరకయాతనలలో పడద్రోసిన దానవు నీ వొక్కదానవే. మన ప్రేమలో కళంకము

లేదు. నిష్కల్మష హృదయుల ప్రేమ స్థిరస్థాయిగా నిలిచి వుంటుందని నా నమ్మకము. నా శరీరము మాత్రమే యిక్కడవున్నది. మనస్సుమాత్రం ఎప్పుడూ నీవద్దనే వుంటోంది. మనము యీ విధంగా విడిగా వుండటంవల్ల నా పరిస్థితి ఎలాపరిణమిస్తుందో ఊహించలేక పోతున్నాను. యింతకంటే ఎక్కువ వ్రాయలేక పోతున్నాను. వెంటనే జాబు వ్రాయి. వ్రాస్తావు కదూ?

ఇట్లు
ప్రేమతో. నీ ప్రియ

ఉత్తరం పూర్తి చేసేసరికి రమణమూర్తి హృదయంలో అగ్ని పర్వతము బ్రద్ధలైనట్లయింది. అతని శరీరం కంపించి పోతోంది. ఈ ప్రియ ఎవరు? ఎప్పటి నుండి యీ వ్యవహారం జరుగుతోంది? ప్రేమతో చూస్తున్న నన్ను మోసగించిన దీనికి మోక్షముందా? తన అందచందాలకు దాసుణ్ణయి, తను ఏమి చేసినా అంగీకరిస్తానని తలచిందా? ఎప్పటికైనా తనబండారం బయట పడుతుందనే భయమేలేకుండా ప్రవర్తిస్తోందా? ఆలోచనలలో మునిగియున్న రమణమూర్తి "భోజనానికి లేవండి" అన్న పిలుపుతో ఆలోచనలనుండి బయటపడ్డాడు. కాని భార్యకు సమాధానం చెప్పలేదు.

భర్త మాట్లాడక పోయేసరికి, దగ్గరగా వెళ్లి 'ఈ వేళ అదోలావున్నారు, ఒంట్లో బాగాలేదా?' అంటూ భుజంపై చేయి వేసింది. అంతే! అతని కోపం ఒక్కసారిగా పెల్లుబికింది. నాకేర్గోగము రాలేదు. నేను ఈపూట భోజనము చేయను. నీవు భోజనముచేసి హాయిగా పడుకో. నాసంగతి తెలుసుకోవలసిన అవసరము నీకేమీ లేదులే! అంటు భార్యచేతిని విసరికొట్టి గబగబా వీధిలోనికి వెళ్ళిపోయాడు రమణమూర్తి.

భానుమతి మంచముపై పడి వెక్కి వెక్కి ఏడువసాగింది. ఎన్నడూలేనిది ఎందుకు ఈ నాడు యిలా ప్రవర్తిస్తున్నారు. ఎప్పుడూ నన్ను ఒక్క మాటైన అని యెరుగరే! నేను ఏదైనా తప్పుచేస్తే మందలించ కూడదా? లేక దండించకూడదా? అయినా దండించే టంతటి తప్పు నేనేం చేశాను? "ఏమీ చెప్పకుండానే కోపంతో 'వెళ్ళిపోతే నేనేం చేయను? ఎవరు చెబుతారునాకు? తిరిగి యెప్పటికి వస్తారు? యిటువంటి ఆలోచనలతో తనకు తెలియకుండానే నిద్రాదేవికి లొంగిపోయింది భానుమతి.

రాత్రి పన్నెండు గంటలయింది. రమణమూర్తి నెమ్మదిగా యింటికి చేరుకున్నాడు. వీధి తలుపు దగ్గరగా వేసివుంది. లోనికి వెళ్ళాడు. చీకటిగా వుంది, తన భార్య దీపంకూడ వెలిగించ లేదన్నమాట. వీధి తలుపుకూడ వేయటం మరచిపోయిందా? వేయలేదా? తన జేబులో నున్న అగ్గిపెట్టె తీసి దీపం వెలిగించాడు. మంచముపై భార్య నిద్రపోవటం చూశాడు. దగ్గరకు వెళ్ళాడు. ఆమె బుగ్గలపై కనిపిస్తున్న కన్నీటిచారలు చూచి జాలిచెందాడు. యింతలో వుత్తరం గుర్తుకు రావటంతో ఆస్థానంలో కాఠిన్యం ఆవహించింది. చర చరా తన గదిలోనికి పోయి పడుకున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో అతనికే తెలియదు.

ఉదయం ఏడుగంటలయింది. కాఫీగ్లాసుతో భానుమతి భర్త గదిలోనికి ప్రవేశించింది. అప్పటికే రమణమూర్తి యింటినుండి బయటికి వెళ్ళిపోయాడు. ఆ విషయమే భానుమతి గుర్తించలేదు. కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి కుర్చీలో కూలబడింది.

ఉదయం పదిగంటలయింది. నెమ్మదిగాలేచి వంట చేసింది. భానుమతి, భర్తకోసం ఎదురు చూడసాగింది. మధ్యాహ్న భోజనానికి రాలేదు రమణమూర్తి. భానుమతికూడ ఆపూట భోజనము చేయలేదు. భర్త కోసం నిరీక్షిస్తూనేవుంది. రాత్రి ఎనిమిది గంటలకు యింటికి వచ్చాడు. రమణమూర్తి తిన్నగా గదిలోనికి వెళ్ళి బట్టలు మార్చుకుని బయటకు వెళ్ళిపోవటానికి సిద్ధమౌతున్నాడు. 'ఏమండీ!' అనే భార్య పిలుపుతో వెనుకకు తిరిగాడు.

"నేనేం తప్పుచేశాను? నాతో మాట్లాడటమే మాని వేశారు. నాతో మాట్లాడక పోయినా, భోజనమైనా చేసివెళ్ళండి. ఉదయంనుండి మీరు భోజనమే చేయలేదు." అంది ఎంతో దీనంగా భానుమతి.

"నేను భోజనము చేయకుండా వుండటమే నీకు తగిన శిక్ష. ఏం తప్పుచేశానండీ! అంటూ నంగనాచిలా నన్ను అడుగుతావేం? చేసినదానికి నీకు తెలియదా?" కోపంతో విసవిసా బయటికి వెళ్ళిపోయాడు.

భానుమతి ఎంతగానో ఏడ్చింది. తాను చేసిన తప్పేమిటో తెలిసికోలేక పోయింది. అసలు తనుతప్పు చేస్తేగదా తెలిసికోవటానికి. ఏడ్చి ప్రయోజనము లేదనుకుంది. ఎందుకు తనభర్త యిలా మారిపోయారో తెలిసికోవాలనుకుంది. భర్త పొరబడితే, భార్యయే ఆ

పొరపాటును సరిదిద్దటం న్యాయమనుకుంది. తను చేయనితప్పుకు తాను ఎందుకు బాధపడాలనుకుంది. అన్నిటినీ మనోధైర్యంతో ఎదుర్కొని తనసంసారం ఒడుదుడుకులు లేకుండా సాఫీగా సాగిపోయేలా చేయాలనుకుంది. లేచి మామూలుగా తనపనులు తను చేసుకోసాగింది.

భార్యా-భర్తలు మాట్లాడుకోకుండానే వారం రోజులుగడచి పోయినై. ఒకనాటిరాత్రి రమణ మూర్తి తనభార్యనుగురించి ఆలోచించసాగాడు.

చిన్నప్పుడే తండ్రిని పోగొట్టుకున్నాడు; రమణ మూర్తి. తల్లి ఎంతో కష్టపడి స్కూలుఫైనలు వరకు చదివించింది. కాలేజీచదువు చదువుకునే స్తోమతు లేదు. ఎక్కడైనా వుద్యోగం చూచుకోవాలనుకున్నాడు. కాని తనతోనే చదువుకుంటూ, ఎంతో స్నేహంగా వుండే భానుమతి అందుకు అంగీకరించలేదు. తనతండ్రితో చెప్పింది. తాను మూర్తిని ప్రేమిస్తున్నాని, అతడు పేదవాడైనా మంచివాడని, అతనిని మనయింట్లోనే వుంచుకొని చదువు చెప్పిద్దామని తండ్రిని బ్రతి మాలింది. కూతురుమాట కాదనలేకపోయాడు తండ్రి. ఆరోజునే వెళ్లి రమణమూర్తిని, అతనితల్లిని తీసుకు వచ్చింది; భానుమతి. వారి సహాయానికి తల్లీ-కొడుకులు ఎంతో ఆనందంతో కృతజ్ఞత తెలియజేశారు.

రమణమూర్తి బి. ఏ. ప్యాసై వుద్యోగంలో ప్రవేశించాడు. తల్లిపోయింది. ఉద్యోగం దొరకిన సంవత్సరములోనే భానుమతి—రమణమూర్తులకు వివాహం జరిగింది. అప్పటినుండి వారిద్దరు సంసార సుఖాన్ని పొందుతూ, ఎంతో అన్యోన్యంగా వుంటున్నారు. ఆ నాటి భానుమతి నిజంగా మారిపోయిందా? లేక నేనే పొరబడుతున్నానా? నాకేమీ అర్థంకావటంలేదు. అనుకుంటూనే నిద్రాదేవి వడిలో వాలిపోయాడు.

ఆనాడు ఆఫీసుకు తిరిగి యిదివరకటివలెనే ఒక కవరువచ్చింది. విప్పిచూశాడు. అందులో :—

ప్రియమైన భానుమతికి!

నిన్ను చూడాలని నామనసు ఆందోళన పడుతోంది. అందుచే రేపు మెయిలులో బయలుదేరి వస్తున్నాను. స్టేషనుకురా. తప్పకుండా వస్తావుకదూ?

ఇట్లు
ప్రేమతో— నీప్రియ.

ఆమరునాడు అన్నిసంగతులు తెలిసికోవచ్చునను కున్నాడు. ఆవచ్చేవాడిసంగతి, తనభార్యసంగతి తేలి పోతుందనుకున్నాడు.

ఆరోజే ప్రియవచ్చేరోజు. సాయంత్రం అయిదుగంటలకు ఆఫీసుపని పూర్తి చేసికొని, తొందర తొందరగా యింటికివచ్చాడు. లోపల నవ్వులు వినిపిస్తున్నయి. రమణమూర్తి కోపంతో చప్పుడుచేయకుండా యింట్లో కాలుపెట్టాడు. అంతే! ఎదురుగా కనుపించిన దృశ్యం చూచి ఆశ్చర్యపోయాడు. తనకళ్లను తనే నమ్మలేక పోయాడు. తన భార్య లోపల ఎవరో యింకొక స్త్రీతో మాట్లాడుతూ నవ్వుతోంది.

భర్తను చూడగానే భానుమతి ఈమె నాస్నేహితురాలు ప్రియంవద. యం. బి. బి. ఎస్. చదివింది. అంటూ పరిచయంచేసింది. ఒకరికొకరు నమస్కారాలు చెప్పుకున్నారు.

తనభార్యకు ఉత్తరాలు వ్రాస్తున్న "ప్రియ" యీమేనన్నమాట. ఎంతోమోసపోయాను. ఆ వ్రాసేదేమిటో పూర్తి పేరుతో వ్రాసుకోకూడదూ? పండంటి సంసారంలో గొడవలు తెచ్చిపెట్టింది. పాపం భాను మతి మనస్సు ఎంతగా బాధపడిందోకదా? యింకా బాధపడుతూనే వుంటుంది. నిజంచెప్పి క్షమాపణ కోరుకోవాలను కున్నాడు, రమణమూర్తి.

ఆరోజే ప్రియంవద తన స్వగ్రామంవెళ్లిపోయింది. రమణమూర్తి భార్యనుపిలిచి, భానూ! ప్రియంవద వ్రాసిన వుత్తరాలు— చూచి, ఎవరో మగవాళ్లు వ్రాశారని తలచి, నిన్ననుమానించి బాధ పెట్టాను. ఇప్పుడు నీవు "నిరపరాధి" వని తెలుసుకున్నాను. నన్ను క్షమించవూ? అంటూ చేతులు పట్టుకున్నాడు. అదేమిటండీ! నన్నుక్షమాపణ కోరతారా? యిప్పటికైనా నిజంతెలుసుకున్నారు అంతేచాలు. అంటూ ఆనందంతో భర్త వడిలో తల్వదాచుకుంది, భానుమతి వస్తున్ననవ్వును ఆపుకుంటూ—

---

"ఆంధ్రము నేర్చినపిమ్మట। నాంధ్రేతరభాషఁ జదువు మంతేకానీ
యాంధ్రము సరిగా నేర్వక। యాంధ్రేతరభాష గూడ దాంధ్రకుమారా!" (పుష్పమాల)

# వార్తావళి

బల్గ్రేడు.

బల్గ్రేడులో సమావేశం అయిన 24 మధ్యస్థరాజ్యాలు, ఈనాటి ప్రపంచ పరిస్థితుల్లో మరల దారుణ యుద్ధానికి దారితీసే ప్రయత్నాలని అరికట్టటం ముఖ్యం అనీ, అణ్వస్త్రాల పరీక్షలు ఇంతతో మానాల్నని తీర్మానించింది. ఈవిషయంలో యుగోస్లోవియా ప్రధాని మార్షల్‌టిటో, భారతప్రధాని పండితనెహ్రూ ఎక్కువగా కృషిచేశారు. దానిఫలితంగా ప్రపంచంలో శాంతి స్థాపనం కొంతవరకు సాధ్యం కావచ్చును. ఇందుకయి పెద్దరాజ్యాలకు అధి నేతలయిన ప్రెసిడెంటు కెన్నడీ, కృశ్చేవులు పరస్పరం కూడి సంభాషించాల్నని కోరుతున్నది. మనప్రధాని, ఈవిషయాన్నిగూర్చి మాత్రమే కాకుండా, కటంగా మున్నగు ఆఫ్రికా ప్రదేశాల్ల పరిస్థితులను గూర్చికూడ శ్రీకృశ్చేవుతో సంప్రతించడానికి ఈ సెప్టెంబరు 6వ తారీఖున మాస్కోకువెళ్లి— మరల స్వదేశం చేరుకున్నారు.

లండన్.

అణ్వస్త్రాల పరిశోధనను నిరసిస్తూ, ప్రజల్లో అశాంతి నెలకొల్పుతున్నాడనే కారణంతో 89 ఏండ్ల వయస్సుగల బెర్ట్రాండు రస్సెలుకు 2నెలల చెరసాలవాస శిక్ష విధించి, అతడి వార్ధకం అనారోగ్యం మొదలయినవి గమనించి వెంటనే వదలిపెట్టారు.

లార్డు పెథిక లారెన్సు మనభారత దేశానికి కట్టకడపటి స్టేటు సెక్రిటరీ. అతడు లేబరు పార్టీ ప్రభుత్వం తరపున మనకు స్వాతంత్ర్యం ఇప్పించాడు. హిందూ దేశానికి పరమమిత్రుడయిన పెథిక్కు లారెన్సు తన 89—వ ఏట— 10—9—61 నాటిరాత్రి పరమ పదించాడు.

టర్కీ.

టర్కీదేశానికి లోగడ ప్రధానిగా ఉండిన 'మెండరస్'— విదేశాంగ మంత్రిఅయిన 'ఫాటిన్ రుస్టుజోర్లు', ఆర్థిక మంత్రిఅయిన 'హసన్ పోలత్కాన్,' అనేముగ్గురిని— ప్రస్తుతం టర్కీ మిలిటరీ అధ్యక్షుడయిన,— జనరల్ 'కెమెల్‌గుర్సెల్'— తీర్మానాన్ని అనుసరించి, దౌర్జన్య పరులనే నెపంతో ఉరితీశారు. ఈ టర్కీ రాజకీయ నాయకులను ఉరితీయటం అక్రమమని, గుర్సెల్ మంత్రి వర్గంలో సభ్యులు, తమపదవులకు రాజీనామా ఇచ్చారని తెలుస్తున్నది ఇటీవలి వార్తవల్ల— అది అసత్యం అని తేలింది.

కటంగా

కటంగా రాష్ట్రాధ్యక్షుడయిన 'షాంబే'—తో రాష్ట్ర శాంతిని గూర్చి చర్చించటానికై ఆకాశ విమానంలో బయలుదేరి వస్తూవుండిన ఐక్యజాతీయ సంస్థా కార్యదర్శిఅయిన 'హామర్స్‌జోగ్' 17—9—61న 'డోలా' అనే ప్రదేశానికి 7½ మయిళ్ల దూరంలో ఉన్న గుట్టమీది అడవికి రాగానే యంత్రం పనిచేయక తీవ్రంగాపడి భూమిలోనికి చొచ్చుకొని పోయినందున, అందు ప్రయాణిస్తూవుండిన 9 మంది ఆపదలకు పాలయిరి. విమానం పడగానే మరణించిన వారు ఆరుగురు. అందులో 'హామర్సుజోగ్' ఒకడు. తక్కిన ముగ్గురు విమానం క్రిందపడి నలిగినారు.

'హామర్సుజోగు' స్వీడన్‌దేశ ప్రధానిగా పనిచేసిన తండ్రికి కుమారుడు. బ్రహ్మచారి. 56ఏండ్ల ప్రాయంవాడు. డాంబికం లేనివాడు. తన విధ్యుక్త ధర్మాల విషయంలో ఎవ్వరినీ సహాయంకోరడు. ఎక్కువగా ఎవ్వరితోనూ మాట్లాడడు. ఇతరులు చెప్పే విషయాలను జాగ్రత్తగావిని, ఆలోచించేవాడు.

ఇతడు స్వీడనులో 1905 సం॥ రం జూలై 29తేదిన జన్మించాడు. స్టాకుహోం విశ్వ విద్యాలయంలో 1934 సం॥ పనిచేస్తూవుండగా, ఆర్థికమంత్రి వర్గానికి ఉపకార్యదర్శి అయి, క్రమంగా 1951 సం॥ న రాష్ట్రమంత్రివర్గంలో ఒకమంత్రిగా ఎన్నుకోబడ్డాడు. ఇతడు ఐక్యరాజ్యసమితికి ట్రిగ్వీలీ తరువాత— 1953 మార్చిలో కార్యదర్శిగా ఎన్నుకోబడినాడు. సూయజ్ కాలువ విషయమయిన తగాదాల్లో— 'ఇస్రాయేలీల' రాజ్యం మీదికి, ఆంగ్ల ఫరాసు సైన్యాలు దండెత్తిరాగా, అది అక్రమమని ఐక్యజాతీయ సంస్థ పక్షాన వాదించి, యిరుతెగల వారికి సమాధానం కుదిర్చి శాంతి నెలకొల్పాడు. ఈ ఏడెనిమిదేండ్లుగా అతడు సాధించిన మహత్తరకార్యాలు మరొక కార్యదర్శి అయితే, సాధించగలిగియుండ లేడనుట సత్యదూరంకాదు.

భారతదేశం:—

ఉపాధ్యక్షుడయిన శ్రీరాధాకృష్ణన్ గారికి 63యేండ్లు నిండినవి. శ్రీవినోబాభావేకు 66 ఏండ్లయినవి. వీరి జన్మ

దినంనాడు అనేకులు స్వయంగాను లేఖల మూలంగాను తమ అభినందనాలు చెల్లించినారు.

పంజాబు:—

పంజాబు సుభా సాధించ డానికి 39 దినాలుగా ఆమర ణాంతోపవాసం జరపపుతున్న శ్రీమాస్టరు తారాసింగు తన మంకుపట్టు విడువనంటున్నాడు. అటు భారత ప్రభుత్వం కూడా పంజాబు సుభా ఏర్పరచే విషయంలో కలిగే మేలు కీళ్లను విస్పష్టం చేస్తు అతణ్ణి ఉపవాస వ్రతం మానమంటున్నది. రాయబారాలు కూడ నిలిచి పోయినవి. ప్రకృతం ఈవిషయాన్నిగూర్చి సమగ్రంగా పరిశీలించి, ఒక నివేదికను అందజేయవలెనని ప్రభుత్వాదేశమయినట్లు వార్త.

ఇది యిట్లుండగా, సిక్కులు ఆయాప్రదేశాల్లో ఉండే 'గురుద్వారా'లలో బలాఢ్యులయి ప్రభుత్వాన్ని యెదుర్కొనగల నేరస్థులను నిండిస్తున్నారని, వారిని అరెస్టు చేయటానికి వచ్చే పోలీసులను లోపలి ప్రదేశాలకు వెళ్లనివ్వడంః లేదని తెలుస్తున్నది. పైగా నూత్నయుద్ధ పరికరాలను, ఆయుధాలను విరివిగా అక్కడ చేరుస్తున్నారనికూడా పంజాబు ప్రభుత్వం ప్రకటిస్తున్నది.

మద్రాసు :—

మద్రాసు ఉన్నత న్యాయస్థానమున శ్రీరాజమన్నారు గారిస్థానే తాత్కాలిక ప్రధాన న్యాయాధిపతిగ నియమింపబడిన-శ్రీ-యస్. రామచంద్ర అయ్యరుగారిని ఆపదవిలో ఖాయపరస్తూ శ్రీ గవర్నరుగారు వారిచే 16-9-61 తారీఖున రాజభక్తి ప్రమాణం గిండీలోని తమరాజభవనంలో చేయించారు. ఆసమయంలో శాసనసభలో ఉపాధ్యక్షులయిన శ్రీ. బి. భక్తవత్సలంనాయుడు, హోంశాఖకు మంత్రి— శ్రీభక్తవత్సలం, ప్రభుత్వ ప్రధానకార్యదర్శి ఆర్. ఏ. గోపాలస్వామి, హైకోర్టు రిజిస్ట్రారు— యస్. కే. గజేంద్రంనాయుడు హాజరయినారు.

ఉన్నత న్యాయస్థానంలో పనిచేయటానికి, డిస్ట్రిక్టు సెషన్సు జడ్జీలుగా ఉన్న శ్రీ— ఆర్. సదాశివం, శ్రీ.కే. యస్. వెంకట్రామన్ గార్లను ఖాయంగా నియమిస్తూ భారతాధ్యక్షులు ఉత్తరువులు జారీచేశారు.

మద్రాసు ప్రభుత్వం గుడ్డలు, అట్టకాగితాలు వగైరాలతో బొమ్మలు తయారుచేయటానికి ఒక అభ్యసన శాలను మదరాసులో స్థాపించ తీర్మానించుకొన్నది. అందుకయి రూ 48,200 లు శాంక్షనుకూడా చేసింది. ఇది ముఖ్యంగా మహిళలకు పనికివచ్చే కుటీర పరిశ్రమ. మొదటిసారిగా ఇందులో 50 మందిని తరిబీతు చేయటానికి పూనుకుంటుంది. కొందరు జపాన్ దేశీయులను ట్రెయినింగు ఇవ్వడానికి ఏర్పరుస్తుంది. ట్రెయినింగు ఆరునెలలు మాత్రమే. ఆకాలానికి ట్రెయినింగు పొందే ఒక్కొక్కరికి రూ 60/-లు స్టయిపండుకూడా ప్రభుత్వం ఇస్తుంది.

---

## చె ణు కు లు

1. ఇద్దరు స్నేహితులు తప్పతాగి కాఫీ హోటలుకు వెళ్లారు. వారిలో మొదటివాడు, "ఏయ్ సర్వర్! రెండు స్ట్రాంగ్ టీ! పట్రా!........

2 వా. ఒరేయ్!...బ్రదర్ నాకు స్ట్రాంగ్ కాఫీ చెప్పవద్దురా! టీయే! కావాలి!

1 వా. ఎవడ్రా!....వీడు....స్ట్రాంగ్ కాఫీ కావాలంటాడూ!....అబ్బాయ్ నేను రెండులైట్ కాఫీలకూ ఆర్డరిచ్చేసా! ఈసారికిది పుచ్చుకోరా బ్రదర్! ఇంతలో సర్వర్ రెండుగ్లాసుల మంచినీళ్ళు అక్కడపెట్టి అసలు ఆర్డరుకోసరం లోనికి వెళ్ళగా ఇద్దరూ ఆ మంచినీళ్లు గడగడత్రాగేస్తారు.

1 వా. అబ్బే! లైట్ కాఫీలకు ఆర్డరిస్తే! స్ట్రాంగ్ తీసుకవచ్చాడు.

2 వా. అబ్బే అసలు పంచదారే లేదురా! బ్రదర్। ఉత్తచప్పగా వుంది! అన్నాడు డబ్బులుతీస్తూ!

1 వా. ఒరేయ్! పంచదార లేదంటున్నావ్! బలేవాడివి...పోనీలే వేడిగన్నా వున్నాయట్రా!

2 వా. "ప్చ్!" వుత్తచల్లగా వున్నాయి.

—శ్రీ వేముల కుటుంబరావు.

# ANDHRA MAHILA SABHA

# SILVER JUBILEE CELEBRATIONS

**MAY 1962.**



The Celebrations will reflect the achievements of the women of India in the fields of Education and Social Welfare. Besides an All India Women's Arts and Handicrafts exhibition, Seminars will be conducted in which distinguished Women from all over India are expected to participate.



*OUR MOTTO* :

To provide instruction and training to women for harnessing their services in building our nation.

# 'ఆంధ్ర మహిళ'

(ఆంధ్ర మహిళాలోకాభ్యుదయ మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు:

**శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్.**

విడి పత్రిక—37 నయాపైసాలు ప్రత్యేక వార్షిక సంచికతో కలిసి

సం॥ చందా - రూ. 6-00.

పంచాయతీ సంస్థలకు. సంక్షేమ సంఘాలకు, పౌరజన గ్రంథాలయాలకు పాఠశాలా పుస్తక భాండాగారాలకు సగము చందా సం॥ రం॥ కి రూ. 3-00 లు.

## పత్రికా విక్రయసంస్థల యేజంట్లకు

1. 'ఆంధ్ర మహిళ' ఆరింటికంటె తక్కువ ప్రతులకు ఇచ్చే ఆర్డర్లు గమనింపబడవు.
2. పత్రికకు 1 కి 12 న. పైసాలు కమీషను ఇవ్వబడును. పోస్టేజి మేమేభరింతుము.
3. విక్రయంకాని సంచికలు వాపసు తీసికోబడవు.
4. ప్రతినెల "ఆంధ్ర మహిళ" ఎన్నిప్రతులు కావలెనో సూచిస్తూ. అసలుక్రయంలో కమీషను మొత్తం మినహాయించుకొని, తక్కిన మొత్తంతో వచ్చే ఆర్డర్లు అంగీకరింప బడును.
5. ప్రత్యేక వార్షిక సంచిక ప్రతి 1. కి రూ. 2 లు, అయినా, యేజంట్లకు రూ. 1. 50 కే, (అనగా 25. కమీషన్ మినహాయింపుతో) ఇవ్వబడుతుంది.

## ఆంధ్రమహిళ

### ప్రకటన రేట్లు

సామాన్యమైన పుట 1 కి. రూ 60. లు,

అట్టకాగితం 2 వ పుట, 3. వ పుట (ఒకేరంగుతో) రూ 80 లు.

4. వ పుట (ఒకేరంగుతో) రూ 100 లు.

కొయ్య దిమ్మెలుగల బ్లాకులు అంగీకరించ బడును. ప్రకటనలు. బ్లాకులు పత్రిక వెలువడే తారీఖునకు 10 దినములు ముందే మాకు చేరాలి.

మేనేజరు,
ఆంధ్రమహిళ
7 ఎ రోజరీచర్చిరోడ్డు,
మైలాపూరు—మద్రాసు 4.

Printed at Andhra Mahila Press, 7/A, Rosary Church Road, Published and Owned by Andhra Mahila Sabha, Madras Editor - Secretary, Andhra Mahila Sabha.

